

డిసెంబర్ 1979 సంచికలో

అందించబడిన

పూర్తి నవల



# కాత్యాయని

రచన:

బెహరా సాహితి

"సుశీల వుందాండీ?" అంటూ తలుపు తోసుకుని, తొంగి
కాత్యాయని.

"ఎవరూ?" అంటూ తత్తరపడుతూ, తటాలున
చేతుల్లోంచి విడివడింది సుశీల తల్లి పార్వతి. ప్రకాశం
కొంటెగా. "ఓసి, నువ్వాచే" అని తేలిగ్గా నిట్టూర్చి, ప్ర
చూపి మూతి ముచ్చటగా తిప్పి "అయిందా అబ్బాయిగారి ప
అంది.

"అవలేదింకాను?" అంటూ ఆమెను మళ్ళీ దగ్గరకు
న్నాడు.

"ఏయ్, చిన్నపిల్లముందు యేమిటిది?" అంటూ మీదకి
అతని మొహాన్ని పక్కకి నెడుతూ, కిలకిలా నవ్వుతూనే
లేదే కాత్యా. లక్ష్మి వాళ్ళింటకి వెళ్ళింది" అంది.

వాళ్ళ సరసం చూసిన కాత్యాయనికి ఎందుకో సిగ్గనిపిం
వెనక్కి తిరిగి వెళ్ళిపోతూ, "మళ్ళీ ఓసారి చూస్తేనో....
చేస్తున్నారో...." అనిపించింది. కాని ఆ పని చేయలేకపోయ
"ఛీ! అదేంటి బాబూ" అనుకుంది. తను అక్కడ వున్నా
ప్రకాశం మామయ్యగారు అత్తయ్యనలా దగ్గరకు లాక్కుంటా
తనని బహుశా చిన్నపిల్లగా జమ కట్టేసివుంటారు. తనేం
పిల్లా? అమ్మకూడా అంతే "నీకెందుకే చిన్నపిల్లవి. నోరు మూసు
అంటూంటుంది ప్రతి విషయానికీను. తనకి పదేళ్ళు రాలేదూ! ఇ
యెంత చిన్నపిల్లేమిటి తను? అక్కనీ అలాగే మొన్న మొన్నటి
"చిన్నపిల్లవి....నీకెందుకు అన్నీ" అని కసురుతుండేవారు. ఆర
చాపవేసి మూల కూచోపెట్టి, పేరంటం చేసిన దగ్గర్నుంచీ,
పెద్దదయిపోయింది.

ఇప్పుడు దాన్నందరూ పెద్దదానిలాగే చూస్తారు
వోణీలు కొనితెచ్చాడు నాన్న. "అస్తమాను గుమ్మం దగ్గర
బడకు" అని కసురుతుంది అమ్మ. పెద్దవాళ్ళముఖతే బా
వుంటుందిగాని, గుమ్మందగ్గిర కూడ నిలబడవద్దంటే మాత్రం.

కష్టం! పదేళ్ళ కాత్యాయని రోడ్డుమీద పరధ్యానంగా నడుస్తోంది.

"కాత్యాయనీ....ఏయ్....నిన్నే."

పిలుపు వినిపించి, ఉలిక్కిపడింది. రోడ్డు కట్నుంచి సుశీల పిలుస్తోంది. ఓసారి అటు, ఇటుచూపి రోడ్డుదాటి సుశీల దగ్గరకెళ్ళింది కాత్యాయని.

"నేను మీ యింటికే వెళ్ళి వస్తున్నానే."

"అయ్యో! అయితే పద. నేను లక్ష్మిదగ్గిరకెళ్ళి, నా సోషల్ బుక్ తీసుకువస్తున్నాను. పద. అవునూ, నిన్న స్కూలు కెందుకు రాలేదూ?"

"ఇంట్లో పనికి సాయం" కసిగా, కోపంగా అంది కాత్యాయని.

"ఏం? మీ అక్కేమయింది?"

"అది మూల కూచుంది. మామ్మకి జ్వరం. అమ్మకి నడుం నొప్పి. నన్ను బడికెళ్ళవద్దని, ఇంట్లో కూచోపెట్టారు." కాత్యాయని మాటల్లో తల్లిమీద నేరారోపణ.

"అయినా మీ యింట్లో మరీను బాబూ. మా అమ్మ నన్ను ఒక్క పని చెయ్యనివ్వదు" సుశీల కళ్ళు తిప్పుతూ చెప్పింది.

కాత్యాయనికి బాధగా, చిన్నతనంగా అనిపించింది.

"ఔను. నువ్వు అదృష్టవంతురాలివి" అంది గంభీరంగా ముఖం పెట్టి.

సుశీల కేమనాలో తెలియలేదు. కొంతసేపు మౌనంగా నడిచారు యిద్దరూను.

"నీ లెక్కల నోట్సు యిస్తావా? వడ్డీ లెక్కలు మొదలుపెట్టేశారా నిన్న!" కాత్యాయనికి బెంగగా వుంది కొత్త లెక్కలు మొదలు పెట్టే రోజు స్కూలుకి వెళ్ళలేక పోయానే అని.

"అమ్మా!" అంటూ లోనికి పరుగెత్తింది సుశీల. గుమ్మం దగ్గరే నిలబడిపోయింది కాత్యాయని. వాళ్ళిద్దరూ యిందాకటిలా అలాగే వున్నారా? ఆ పిల్ల ఆలోచనలో ఇందాకటి దృశ్యం మెదిలింది. ఈసారి సుశీల తల్లి వంటయింట్లోంచి బయటకు వస్తోంది.

తండ్రి ప్రకాశం డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుని, కాఫీ తాగుతున్నాడు.

"ఇదిగోనే నోట్ బుక్. కాసేపు ఆడుకుని వెళుదువుగాని ఏం? క్యారంబోర్డు తీసుకురానా?" ఆశగా అడిగింది సుశీల.

తల అడ్డంగా తిప్పి "మా అమ్మ తంతుంది బాబూ! చీకటి పడకముందే వెళ్ళిపోవాలి. అసలు పుస్తకం తీసుకోడానికి రేపు పొద్దున్నే వెళ్ళచ్చులే అంది. నేనే వచ్చేశాను" అంది కాత్యాయని మనసులో ఆటమీద ఆసక్తి వున్నా తల్లి భయంతో వెళ్ళలేక వెళ్ళింది.

"ఏంటమ్మా. కాత్యాయని ఎప్పుడూ వాళ్ళమ్మ, వాళ్ళ నాన్న కొడతారనే చెప్తుంది" సుశీల సందేహం.

"బాగుంది. అల్లరి బాగా చేస్తుందేమో, కొడతారేమో!" తేలిగ్గా అనేసి, నవ్వేసింది పార్వతి.

"ఏమిటమ్మా అలా అంటావు!" బుంగమూతి పెట్టింది సుశీల. "కాత్యా మంచి పిల్లమ్మా! ఎంతో తెలివైనదని మాష్టారు పొగుడుతారు తెలుసా!" తన స్నేహితురాలు అల్లరిదని తల్లి అనుకోవటం బాగులేదు సుశీలకు.

"అలాగా! అయితే మంచిదేలే! ఆ తెలివితేటలు నేర్చుకుంటే నేర్చుకున్నావుగాని....మరేం నేర్చుకోకు."

"మరింకేముంది నేర్చుకుందికి?"

"ఏమీలేదుగాని పద కాళ్ళూ చేతులూ కడుక్కో."

"చెప్పమ్మా! ఏవుంది నేర్చుకునేది" తల్లి దృష్టిలో తన దృష్టిలో తన స్నేహితురాలి విలువ తగ్గిపోతుందేమో నన్న ఆరాటం సుశీలలో ఎక్కువైంది. "చెప్పమ్మా! ఏం నేర్చుకోకూడదు. తను మంచిపిల్ల కదమ్మా! యేం....కాత్యాయని మంచిది కాదూ!"

"అబ్బ! మంచిదే లేవే!"

"మరేమిటి నేర్చుకోవద్దు అంటున్నావు?"

"అబ్బబ్బ! చెప్పేదాకా వదలవుగదా! వాళ్ళు బీదవాళ్ళు. బీద వాళ్ళకి సాధారణంగా లేకిబుద్ధులు వుంటాయి. కాత్యాయనికి కూడా ...."

"పార్వతీ!" గట్టిగా కేకేశాడు ప్రకాశం. దగ్గరగా వస్తూ విసుక్కుంటున్నట్లుగా ముఖంపెట్టి అన్నాడు,

"ఏమిటి నువ్వు చెప్పే పాఠాలు! పిల్లలకి యిలాగేనా చెప్పేది. వాళ్ళ మనసుల్లో లేనిపోనివి నూరిపొయ్యడం తప్ప, ప్రయోజన మేమైనా వుందా యిలాంటి కబుర్ల వల్ల."

"ఏదో మాటవరసకి అనబోయానండీ! చెప్పేదాకా వదలదు .వా యిది."

"మాట వరసకి కూడా అనవలసిన పనిలేదు. మనమేదో ధన వంతులం, గొప్పవాళ్ళం అన్న వూహలు పిల్లలకి యిప్పట్నుంచీ యేర్పరచడం మంచిది కాదు. స్నేహంలోని తీపి అంతా వాళ్ళ వయసులోనే అందేది."

"సర్లెండి! ఏదైనా అంటే చాలు ఉపన్యాసం."

సుశీల కాళ్ళు కడుక్కునేందుకు వెళ్ళింది, వాళ్ళిద్దరూ సంభా షణలో పడడం చూసి.

"ఇన్ని కబుర్లు చెప్తున్నారుగాని....మరి మీరు ఇందాక ఆ పిల్లముందు నన్ను...."

"ఊఁ....నన్ను...." అంటూ చిలిపిగా నవ్వేడు.

పార్వతి నవ్వేసింది. "మీరు అలా బిహేవ్ చెయ్యొచ్చా!"

ప్రకాశం ముఖంలో నవ్వు మాయమైంది. ఆలోచిస్తూ అన్నాడు. "నిజమే పార్వతీ. మనం ఎన్నెన్నో పొరపాట్లు చేస్తుంటాం పిల్లల విషయంలో. మన చేష్టలు మాటలు ప్రవర్తన ....అన్నీ కూడా పిల్లలమీద యెంతెంత ప్రభావం చూపుతాయో తెలుసుకోలేం. తెలుసున్నా పట్టించుకోం. సాయంత్రం సంఘ టన ..."

"ఆ....పోనిద్దురూ....అంత ఆలోచించాల్సిన పనేం లేదు. కుర్రపిల్ల. దానికేం తెలుసు దాని మొహం. అయినా, మీరనుకుం టారు గానీ....సినిమాలు చూడరాదూ యెలా వున్నాయో! పదేళ్ళ లోపు పిల్లలకి కూడా సమస్తం అర్థమవుతున్నాయి ఈ సినిమా లొచ్చాక."

"సమస్తం అంటే?"

"అదే శృంగారం...."

"శృంగారమా, బూతా?"

"పోనీ....అదే అనుకోండి."

* * *

"ఆ పుస్తకం అలా పడేసి, ఇలా వచ్చి తమ్ముడ్ని తియ్యవే కాతీ!" కాత్యాయని తల్లి సుభద్రమ్మ గట్టిగా ఓ కేకపెట్టింది వంటిట్లోంచి.

సర్రున కోపం ముంచుకొచ్చింది కాత్యాయనికి.

పుస్తకం విసురుగా గిరవాటేసి "కాతీ ఏమిటి కాతీ.... ఖాతీను. ముద్దుగా 'కాత్యా' అనలేవూ!" అంటూ నేలమీద నీటిని తపతప కొడ్తున్న తమ్ముడ్ని పైకి తీసింది.

"సరే! అసలు మిమ్మల్ని పిలవలేకనే ఛస్తుంటే పిలుపులో అందా లొకటి తక్కువయ్యాయా నీకు?" అన్నం వారుస్తూ, వెనక్కి చూడకుండానే అంది సుభద్రమ్మ.

తమ్ముడ్ని ఎత్తుకుని, తన పరికిణీతో వాడి ఒంటి నున్న తడి తుడుస్తూ, తల్లిని వెనకనుంచి చూస్తూ వుండిపోయింది కాత్యాయని. చెమటతో తడిసిన ఒంటికి జాకట్టు అతుక్కుపోయింది.నలభైయవ పడిలోకి రాకుండానే ఆమె జుట్టు నెరవడం మొదలయ్యింది. తెలుపు, నలుపు దారాలు కలిపి పేనినట్లుగా అల్లిన జడను, చిన్న ముడిగా చుట్టింది. మెడ వెనగ్గా మురికిగా మాసి వున్న పసుపుతాడు, నల్లపూసలు. నీరు దిగి, మెరుపు పోయి జిడ్డోడుతున్నట్లున్న పొళ్ళ దుద్దులు చెవులకి. కిరసనాయిలు స్టవ్ వెలుగుతోంది. ఆ వెలుగులో ముక్కుపుడకలో నీరు దిగక మిగిలిన పొడి ఒకటి తళుక్కుమంది, రాక్షసుడి ఒంటికన్నులా.

'అమ్మ యెంత కష్టపడుతోందో?' జాలితో నిండిపోయింది కాత్యాయని మనసు.

సుభద్రమ్మ వార్చిన అన్నాన్ని మళ్ళీ స్టవ్‌మీద పెడుతూ.... "కూరలేం లేవు. రాత్రికి చింతకాయ పచ్చడివేసుకు తినండి" అంది

నింపాదిగా.

కాత్యాయనికి మళ్ళీ కోపం తరుముకు వచ్చింది.

"ఏం? ఎందుకులేవు? రోజూ యింతేనేమిటి? ఆ పాత చింత కాయ పచ్చిడి నాకొద్దు. నేను తినలేను. ఛీ! ఎప్పుడూ యింతే. చక్కగా బంగళా దుంపలు వేయించకూడదూ!" ఆకలిగా వుంది కాత్యాయనికి.

తల్లి పచ్చడి పేరెత్తేసరికి....ఆకలి....కోపంగా మారింది. కీచుబోయిన, కంఠాన్ని నొక్కిపెట్టి, రాబోయిన కన్నీళ్ళని వెనక్కి నెట్టి, గిరుక్కున తిరిగివెళ్ళింది.

శూన్యం నిండిన కళ్ళతో ఓమారు కూతురు వెళ్ళినవేపే చూసింది సుభద్రమ్మ.

*　　*　　*

కాత్యాయనికి నిద్ర రావడంలేదు. ముచ్చటైన బంగళా, ముద్దు లొలుకుతూ బుట్టబొమ్మలాంటి ఒకే ఒక్క కూతురు సుశీల, భర్త్కని పచ్చరంగు స్కూటరు. సినిమాలో హీరో....హీరోయిన్లలా పార్వతీ ప్రకాశాలు కాత్యాయని కళ్ళముందు యిపే మెదులు తున్నాయి.

"అమ్మ, నాన్న ఒక్కసారీ....అలా సరదాగా వుండరు. ఎప్పుడూ దెబ్బలాడుకోడమే. తమ యింటి పక్కన వున్న సింహా చలం గాడు. రత్తమ్మకూడా అలాగే తగువులాడుకుంటారు. కాని తర్వాత మళ్ళీ నవ్వుకుంటారు. సినిమాకి వెళ్తారు. రత్తమ్మ రోజూ రెండుమూర్ల పువ్వులు పెట్టుకుంటుంది. అది పాచిపని చేస్తోంది గదా. దానికి డబ్బు లెక్కడ్నుంచి వస్తాయో పువ్వులు కొండానికి. నాన్న ఆఫీసులో గుమాస్తాగా చేస్తున్నాడు. అయినా ఏం లాభం? 'పువ్వులు కొనవే' అంటే అమ్మ కసురుతుంది "అక్ఖర్లేదులే! ఆ డబ్బులుంటే ఓ కూర కొనచ్చు" అని. ఏమిటో బాబూ. ఏం బాగా లేదు తమ యిల్లు, తల్చుకుంటే ఏడుపొస్తుంది గూడాను."

"ఏయ్! సుభద్రా! నిన్నే....ఇదిగో....ఇలారా!

గాజుల చప్పుడు. తల్లి లేచి తండ్రి వెనకే వెళ్ళడం "అబ్బ!

వుందురూ! చాకిరీ చేసిచేసి ఒళ్ళంతా...." అంటూ తల్లి మాటలూ....

ఎందుకో కాత్యాయనికి ఒళ్ళు మండింది. పెద్ద గొంతుతో అరిచినట్లుగా అడిగింది.

"మంచి నీళ్ళు" అని.

దూరంగా, ఓ మూలగా పడుకున్న అక్క సరస్వతికి కూడా నిద్ర పట్టలేదు కాబోలు. "అదిగోనే....అక్కడే వున్నాయిగా నీళ్ళు అరుస్తావేం" అంది పక్కకి వత్తిగిల్లి.

*　　*　　*

సుభద్రమ్మ నీరసంగా గోడకి జేరగిలబడింది. వెంకట్రావు కుర్చీలో కూర్చుని తలపట్టుకున్నాడు. సరస్వతి వంటింటి గుమ్మం లోంచి కుతూహలంగా తొంగి తొంగి చూస్తుంది. పదహారేళ్ళ వయసు ఎన్నోకలలని వెంట తెచ్చింది. మనసులో హరివిల్లులు వింత రంగులు చిమ్ముతున్నాయి. ఆ పిల్ల కనులు సూటిగా చూడటం మానేశాయి.

ఓరచూపులు, ప్రక్కచూపులు నేర్చుకున్నాయి కొత్తగా. నడకలో కులుకు, వయ్యారం, కళ్ళలో ఆశలు తళుక్కుమని మెరుస్తున్నాయి. ఇప్పుడామె ముఖంలో యేదో విచారం క్రమ్ముకుంది. దానికి కారణం చలపతి చెప్పిన చేదు వార్తే.

"ఎనిమిదివేలకి తక్కువయితే అసలు పిల్లని చూడ్డానికే రావటం అనవసరం అంటున్నారు వెంకట్రావూ!" అన్నాడు చలపతి పెదవి విరుస్తూ. చలపతి పక్కింట్లోవున్న మరో గుమాస్తా. సరస్వతికి పెళ్ళి సంబంధంవుంటే చూడమని మొదటి ప్రయత్నంగా అడిగాడు వెంకట్రావు. చలపతి యిచ్చిన వార్త యిది. "హు సరి పోయింది. పిల్లనే చూడరటనా?" గొణిగింది సుభద్ర.

"ఇక మొదలు ఆశాభంగాలు." వెంకట్రావు బాధగానవ్వేడు.

"అరే! అప్పుడే ఏదో పది సంబంధాలు తిరిగి పోయినట్లు డీలాపడిపోతా వేమిటోయ్! ఆడపిల్ల పెళ్ళంటే మాటలా? ఏదీ యింకా ప్రారంభదశలోనే వున్నావు. అప్పుడే నీరసపడి పోతు

న్నావే!" వేళాకోళ మాడాడు చలపతి.

వెంకట్రావుకి నవ్వుదామన్నా నవ్వు రాలేదు. ఎదురుగా కట్నాల భూతం నోరు తెరచుకొని తనని మింగబోతున్నట్లు మీదిమీది కొస్తూ భయపెడుతోంది.

"మన పరిస్థితు లంతంత మాత్రం. అంతలేపి కట్నాలు ఎలా తేగలం చెప్పండన్నగారూ!" జాలిగా అంది సుభద్రమ్మ. ఇంతలో అటునుంచి గెంతుకుంటూ తిరిగి వచ్చింది కాత్యాయని. "అయ్యాయిటే ఆటలు. పద యింక." తల్లిమాటలు వినకుండానే, హుషారుగా అడిగింది

"అమ్మా! ఎవరో వస్తారన్నావు. రాలేదూ!"

"ఊఁ....రాలేదు."

"ఏం? ఎందుకు రాలేదు. అక్కకి పెళ్ళిచూపు లన్నావుగా నిన్న?"

"ఆ! పెళ్ళివారి సంగతే చెపుతుంట. రాలేదు. అన్నీ నీకే కావాలి వెళ్లు."

ఒక్కక్షణం నిలబడి, తల్లి విసుగును గుర్తించనట్టే పరిగెట్టి వంటింట్లోకి వెళ్ళింది. వెళ్తూవెళ్తూ "అయితే మరీ మంచిది. నిన్న వాళ్ళకోసం తెప్పించిన మైసూర్‌పాకూ, మిక్సరూ మనమే తినొచ్చు!" అంది. అక్కడేవున్న చలపతి పకపక నవ్వాడు.

* * *

వెంకట్రావుని మొదటిసారిగా కూతురి పెళ్ళిగురించిన ఆలోచన బాధపెట్టింది. పెద్దకొడుకు రంగారావు బి. ఏ. మొదటి సంవత్సరంలో వున్నాడు. రెండవది సరస్వతి. మూడవవాడు రామం. నాలుగోది కాత్యాయని. ఆఖరివాడు ఏడాది దాటిన పసివాడు.

'బాబోయ్!' గుండె గుభేలుమంది వెంకట్రావుకి. ఈ గడ్డు రోజుల్లో అయిదుగురు పిల్లలతో, నాలుగువందలు కూడా పూర్తిగా రాని తన జీతంతో ముందు ముందు ఎలా? రంగారావు చదువులో అంత చురుకయిన వాడుకాదు. సరస్వతి చదువుతానన్నా తను చదివించలేదు. ఇంటర్ కూడా తను చెప్పించే స్థితిలోలేదు. నిద్రరాక

అటుయిటు దొర్లాడు వెంకట్రావు. ఇన్నాళ్ళూ కళ్ళుమూసుకు నడిచి నట్లూ, ఈవేళే కళ్ళు తెరుచుకున్నట్లూ వుంది అతనికి. సరస్వతి పెద్ద ప్రశ్నార్థకంలా తోచింది. రంగారావు తన చెప్పుచేతల్లో లేని మరచెడిన బొమ్మలావున్నాడు. మిగిలిన పిల్లలంతా తన తెలివి తక్కువకి నిదర్శనంగా, తన వాజమ్మ తనానికి ఉదాహరణలుగా కనిపిస్తు న్నారు. తానసలు ఆపరేషన్ ఎందుకు చేయించుకున్నాడు కాదు?

వీధి తలుపు గడియపెట్టి వచ్చి, సుభద్ర మంచం చివరగా అంచుమీద కూచుంటూ, అటుయిటు చూసి మెల్లగా పిల్చింది. "ఏమండీ."

"ఊ!" మూలుగులా వుంది అతని స్వరం.

"మరి....మరి" మాట చెప్పలేక నీళ్ళు నమిలింది.

"ఏమిటి?" సందేహంగా చూస్తూ అడిగాడు.

"మళ్ళీ మళ్ళీ....నెల త...."

పక్కలో బాంబు పడ్డట్టు అదిరి పడ్డాడు.

"పాడు గొడవ" ముఖం చిట్లించుకొని రుసరుస లాడాడు. తెల్లబోయింది సుభద్రమ్మ. విసురుగా లేచి, కొంగు దులుపుతూ, "ఏమాట అనడానికయినా మొదట సిగ్గుండాలి మీకు" అని గబగబ వెళ్ళి కాత్యాయని పక్కన పడుకుంది. తల్లి తనకి దగ్గరగా పడుకో టంతో మెలకువ వచ్చింది కాత్యాయనికి. ఆమె చెంపలకి వెచ్చగా, తడితడిగా తగిలింది తల్లి కన్నీరు.

"ఏమిటమ్మా?" ఇటు తిరిగి తల్లిగుండెల్లో మొహంపెట్టి అడి గింది. "ఏంలేదు. పడుకో" అంటూ కొంగుతో మొహం తుడుచు కుంది సుభద్రమ్మ.

* * *

"ఏయ్! కాత్యా! పరీక్షలు దగ్గర కొస్తున్నాయి. నువ్వు చీటికీ మాటికీ స్కూలు మానేస్తావేం?" మందలింపుగా అడిగింది సుశీల.

విసుగ్గా "ఏం చేయడం? అస్తమానూ ఏదో గొడవే. మా అమ్మ హాస్పిటల్లో వుండిగా. అక్క ఒకతే పని చేసుకోలేదని ఈ వేళకూడా నన్ను ఆపేశారు" అంది కాత్యాయిని. మనసులో దిగులు

భయం చోటు చేసుకున్నాయి. తనిలా మాటిమాటికీ స్కూలు మాని వేస్తే, తనకంటే సుశీలకే ఎక్కువ మార్కులు వస్తాయేమో! సిక్స్‌త్ క్లాసులో తనే ఫస్టు వచ్చింది. ఈ సెవెంత్‌లో తన రాంక్ పడి పోకూడదు. ఏమైనా సరే పట్టుదలగా చదవాలి.

"జానుగానీ, మీ చెల్లాయి యెలావుండే? ముద్దు ముద్దుగా వుందా? తెలుపా, నలుపా?" ఉత్సాహంగా అడిగింది సుశీల. కాత్యాయినికీ సరదా అనిపించింది మొన్న పుట్టిన చెల్లెల్ని తలుచుకుని, "అబ్బో! బలే బాగుందిలే. చిన్న చిన్న కళ్లు, పుట్టగానే తెరిచేసిందిట. అసలు పిల్లలు పుట్టగానే కళ్ళు తెరవరట తెలుసా!" సుశీలకి తెలియదులే అన్నట్లు చూపింది.

"అలాగా! నాకూ చెల్లాయో, తమ్ముడో వుంటే యెంత బాగుండునో!"

"కావాలనుకున్న వాళ్ళకివ్వడు. వద్దంటే పదిమందినిస్తాడు." అంటూ బుగ్గన వేలేసుకొని, ఆరిందాలా తలత్రిప్పుతూ, గొంతు బొంగురుగా మార్చి, కనురెప్పలాడిస్తూ చెప్పింది. చెప్పి, ఫక్కున నవ్వింది.

"ఇలా ఎవరు మాట్లాడుతారో చెప్పుకో చూద్దాం" అంది.

సుశీల నవ్వేసింది. ఆ తరవాత ఓ క్షణం ఆలోచిస్తున్నట్లుగా ముఖం చిట్లించి చూసింది. "ఆ! మీ మామ్మ."

"భడవల్లారా! ఏం మాటాడుతున్నారో, వేలెడంతలేరు. కుర్ర ముండలు. నన్నే వెటకారం చేస్తున్నారట్టే." నవ్వు, కోపం రెండూ వచ్చాయి, ఇదంతా గమనిస్తూ గమనించనట్టే నటిస్తూన్న మామ్మగారికి.

* * *

"అమ్మాయ్! నువ్వు రేపట్నుంచి కాలేజికి వెళ్ళక్కరలేదు"

"అదేంటి నాన్నా?" బిక్క ముఖంతో అడిగింది సరస్వతి. తప్పుచేస్తున్నట్లు తలవంచుని చెప్పాడు వెంకట్రావు.

"ఇంక చదివించే స్తోమత నాకు లేదమ్మా! అదీగాక అమ్మ ఆపరేషన్ చేయించుకుంది కదా! మూడు నెలలపాటు రెస్టు తీసుకోవా

అన్నాడు డాక్టరు. చంటిదాన్ని చూసుకోవాలి. అవతల మామ్మని చూడాలి. ఇంట్లో నీ తరవాత అంతా చిన్నవాళ్ళు. రంగడ్ని చదివించడమే ఇప్పుడు నాకు పెద్ద భారంగావుంది. ఈ పరిస్థితుల్లో....”
పొంగివచ్చే కన్నీళ్ళని ఆపుకుంటూ, ఉక్రోషం అణచుకోటం శక్యం కాక, గిరుక్కున తిరిగి లోపలికి వెళ్ళిపోయింది సరస్వతి.

అంతా చూస్తున్న కాత్యాయనికి మనసు చివుక్కుమంది. అక్కనిచూస్తే జాలేసింది. ఇంటర్‌లో చేర్పించినట్లే చేర్పించి, ఇప్పుడు మానేయమంటున్నారు. పాపం అక్క.

“ఏం నాన్నా! అక్కనెందుకు చదివించవు?” కోపంగా అడిగింది.

దీనంగా అన్నాడు వెంకట్రావు. “ఏం చేయను తల్లీ. నాకున్న శక్తి చాలదు.”

కాత్యాయనికి గుండె గుభేలుమంది. ఓవేళ తననికూడా టెన్తు క్లాసు పాసవగానే, మానిపించేస్తారో ఏమో! భారంగా వీధివేపు వెళ్తున్న తండ్రిని “నాన్నా” అంటూ కేకవేసింది.

“ఏమిటమ్మా?”

“నన్ను మాత్రం అక్కలాగా స్కూలు మానిపిస్తానంటే వూరుకోను. నేను డాక్టరునవ్వాలి మీరంతా ఏమైనా సరే! చదువు మానిపిస్తానంటే చచ్చినా వూరుకోను” అరచి మరీ చెప్పింది. వెంకట్రావుకి నవ్వు వచ్చింది. అసలే కాత్యాయని కళ్ళు పెద్దవి. సన్నగా, పొడుగ్గా ఓ ఛాయ తక్కువయినా కళకళలాడుతూ వుంటుంది. పల్చని పెదవులు, సూటిగా చూపులు, కొనదేరిన ముక్కు, చిన్న నోరు. కోలగా సాగదీసినట్లుండే ఆ పెద్దపెద్ద కళ్ళల్లో చురుకు, తెలివి కొట్టొచ్చినట్టు కనిపిస్తాయి. తండ్రిని బెదిరిస్తున్నట్లు కళ్ళు మరింత పెద్దవి చేసి, చూపుడువేలు చూపిస్తూ అధికారంగా మాట్లాడుతుంటే వెంకట్రావుకి నవ్వూ, ముద్దు రెండూ కలిగాయి.

“నా తల్లి తెలివయినది. దాని భవిష్యత్తు ఎలా వుంటుందో” అనుకుని, కాత్యాయనితో నవ్వుతూ అన్నాడు.

“అలాగే నమ్మా! నువ్వు టెన్తుకి వచ్చేసరికి అన్నయ్య

బి. ఎ. అయిపోతుందిగా. వాడికేదో ఉద్యోగంవస్తే మనకింత యిబ్బంది వుండదు. నీ చదువుకి ఏ ఆటంకమూ వుండదు. సరేనా!"

కాత్యాయిని ముఖం వికసించింది.

* * *

వెంకట్రావు యింటి పక్కనే సింహాచలం గుడిసె వుంది. సింహాచలం రిక్షా లాగుతాడు, రత్తాలు పాచిపనులుచేస్తూ వుంటుంది. సింహాచలం ఇంచుమించు రోజూ తాగి రావటం మామూలు. రాత్రి తొమ్మిదయే సరికి, వాడి అర్థంపర్థంలేని పేలాపన, రత్తాలు తిట్లు. వాళ్ళపిల్లల యేడుపులు అంతా రణగొణ ధ్వని.

వెంకట్రావు కుటుంబం వుండేది మూడుగదుల ఇరుకుకొంప. ముందు వరండాలో మధ్యగ తడక కట్టివుంది. అటుపక్క వాటాలో ఇంటివాళ్ళు వుంటున్నారు. పక్కయిల్లు చలపతిది. మూడో ఇంట్లో ఓ విధవరాలు, రెండు గదులు స్టూడెంట్స్‌కి అద్దెకిచ్చుకుని, దానితోనే బ్రతుకు వెళ్ళదీస్తున్నది. ఇంచుమించుగా ఆ వీధిలో వున్న వారంతా మధ్యతరగతికి చెందినవారే. ఎదురింట్లో అస్తమానూ పెళ్ళాన్ని కొట్టే సుబ్బారావూ, ఆ పక్కయింట్లో ఆడపిల్లల్ని నవిలేసేట్టు చూసే రవణయ్య. వీధి మొగలో, విధవమరదల్ని వళ్ళో కూచోబెట్టుకున్నంత దగ్గరగా కూచోబెట్టుకుని, వెకిలి చేష్టలుచేసే కిరాణాకొట్టు కామయ్య. ఇటువేపు బతకలేక బడిపంతులన్నట్టు ఈసురోమంటూ బక్కచిక్కిన గొర్రెలా ఎలిమెంటరీ స్కూలు మేష్టరు వీరయ్య. ఇలాగే....ఇంకా యిలాంటివారే ఆ వీధినిగుత్తకు పుచ్చుకున్నారు. ఇళ్ళన్నీ పాతకాలపువే. రంగులు వెలసి, పెచ్చులూడిపోతున్న గోడలు. ఒకటి రెండు పళ్ళు మిగిలిన బోసినోళ్ళలా. వూచలూడిన కిటికీలు. గుమ్మాలముందు వెలవెలబోయే ముగ్గులు, గుమ్మాల పక్కన చెత్తకుప్పలూ, దోమల సంగీతం, ఝూమ్మని ముసిరే ఈగలు. ఆ వీధి శుభ్రతని గురించి పట్టించుకునేవాడు ఆ వీధిలోనే లేడు. మరింక యెచ్చటినుంచో యెలా వస్తాడు? పట్టించుకునే వోపిక, ఆసక్తి రెండూలేవ్ ఆ వీధివారికి.

ఇటువంటి పరిస్థితులలో, పరిసరాలలో కాత్యాయని పెరుగు

తోంది. ఆమె మనసులో ఆలోచనలు అదో మాదిరిగా పెరుగుతు వున్నాయి.

సుశీల వాళ్ళలా తామెందుకు శుచిగా, శుభ్రంగా, హాయిగా, సంతోషంగా నవ్వుతూ వుండకూడదు. తామేం పాపం చేసుకున్నారు.

ఆమాట అడిగితే తల్లి నవ్వి అంది, "డబ్బు తల్లీ. డబ్బు. డబ్బుంటె యేదయినా సాధించవచ్చు" అని.

నిజమే కాబోసు. డబ్బులేకనే తామింత నీరసంగా నిరాశగా వుండవలసి వస్తుందనుకొంటాను. డబ్బేవుంటే అక్క చదువు ఆగి పోయేదా? నాన్న ఆఫీసుకికూడా అలా చిరుగు చొక్కాలు కుట్టుకుని వేసుకుంటాడా? చక్కా, ప్రకాశం మామయ్యగారిలా టెర్లిన్‌షర్టులు వేసుకోడూ!

ప్రకాశం మామయ్య గుర్తుకురాగానే అనాడు తానుచూసిన సంఘటన గుర్తొచ్చింది కాత్యాయనికి. "అచ్చు. సినిమాలోలా చేస్తు న్నారు. అలాచేస్తే బాగుంటుందా? అమ్మో! అమ్మ....అమ్మ రాత్రి అందరూ పడుకోగానే, నాన్న దగ్గరకెళ్ళిపోతుంది. ఎందుకలా! ఛీ అసహ్యం" కాత్యాయనికి ఎందుకో తెలియకనే వెగటుగా అనిపిం చింది. ఇప్పుడు కాత్యాయని నైన్త్ క్లాసు కొచ్చింది. ఆమెలో స్పష్టాస్పష్టంగా ఎన్నెన్నో ఆశలు, ఆలోచనలు, ఖాబోయ్, చద వాలి రేపు లెక్కలు పరీక్ష. లెక్కలు చెయ్యాలంటే మూడ్ కుద రటం లేదు. చెల్లాయి యేడుపు ఒకటి. చట్టునలేచి, పుస్తకాలు చేత పట్టుకుని, "అమ్మా నేను ఈ లాంతరు వెలిగించుకుని వెళ్ళి, డాబా మీద చదువుకుంటానే" అంది.

"సరే! ఇంటివాళ్ళ నడిగి వెళ్లు. తొందరగా దిగివచ్చేయి. చాలా సేపుంటే మంచు పడుతుంది."

"అలాగే!" అంటూ ప్రక్కవాటా వద్దకి వెళ్ళింది. డాబా యెక్కాలంటె ప్రక్కవాటాలోనించి వెళ్ళాల్సిందే! అప్పుడప్పుడు అవసరంవుంటే వారినడిగి, పైకి వెళ్ళడం, వీరికి అలవాటే.

"అత్తయ్యగారూ!" అంటూ తలుపు తట్టింది.

"ఎవరూ?" అంటూ వచ్చాడు యింటిగలాయన.

"ఇంట్లో చెల్లాయి వూరికే గొడవ చేస్తుందండీ. కాసేపు పైకివెళ్ళి చదువుకుంటాను! మీరు పడుకునేటప్పుడు పిలిస్తే, వెళ్లిపోతాను." ప్రాధేయపడినట్లుగా వుంది కాత్యాయని మాటతీరు.

"ఆ! ఆ! వస్తా. తలుపుతీస్తానుండు" అంటూ లోపలికెళ్ళి, మళ్లీవచ్చి, వరండాకున్న కటకటాల తలుపు తీశాడు. ఎడంచేతి వేపునే మెట్లున్నాయి. నాలుగు మెట్లెక్కి, వెనక్కి తిరిగి మళ్ళీ చెప్పింది కాత్యాయని.

"మీరు నిద్రపోయేముందు పిలవండి మామయ్యగారూ! నే వెళ్లిపోతాను. మీరు తలుపేసు కుందురుగాని."

"సర్లె! సర్లె! నువ్వెళ్ళి చదువుకో!"

క్రింద కూర్చుని కూర్చుని కాళ్ళు తిమ్మిరెక్కినట్టయ్యాయి కాత్యాయేనికి. "అమ్మయ్య! పోర్షనంతా ఓసారి కవర్ చేసేసినట్లు అయింది. మొన్న చెప్పిన లెక్కలే మళ్ళీ ఓసారి చూసుకుంటే సరిపోతుంది." అనుకుంటూ, పెన్నుమూసి, పుస్తకం మధ్యగాపెట్టి మడిచింది. లేచి, ఒకసారి ఆవులించి, వళ్ళు విరుచుకుంది. రెండు అడుగులు ముందుకువేసి పిట్టగోడ దగ్గరకి వెళ్ళి నిలబడింది. సగం వూడిన జడను ముందుకు లాక్కొని అల్లుకుంటూ సింహాచలం గుడిసెవేపు చూసింది అప్రయత్నంగా. చుట్టూ చీకటిగావుంది. చిన్న కిరసనాయిలు దీపం వెలుతురు తలుపు సందులోంచి సన్నగా, గీతలాగా ఇవతలకి పడుతోంది. సింహాచలం, రత్తాలు....అయోమయంగా నిలబడిపోయింది కాత్యాయని. అల్లుతోన్న జడమీద చేతులు అలాగే బిగుసుకుపోయాయి. ఒక్కక్షణం తర్వాత తేరుకొని ఎవరో తోసేసినట్టుగా క్రింద కూచుండిపోయింది దభాలున. ఏదో అసహ్యంగా, వికారంగా అనిపించింది. కడుపులో తిప్పినట్లయింది. ఛీ... ఛీ....అనుకుంది అప్రయత్నంగా. చూడరానిదేదో చూసినట్లుగా వుంది. తప్పుచేసినట్లు, ఏదో భయంలాంటి భావం కలిగింది.

చల్లగా అతి శీతలంగా గాలి వేసింది. సన్నగా, చిన్నగా వణికింది. మరు నిముషం, పుస్తకాలు సర్దేసింది. "క్రిందకి పోతాను" అనుకుంది. అంతలోనే మేడమీదకి వస్తున్న ఆకారం కంటబడి

వులిక్కిపడింది. ఇంటిగలాయన. "వాళ్లు పడుకుంటారేమో!" అనుకుంటూ "నేకే వెళ్ళిపోదామనుకుంటున్నాను మామయ్యగారూ. మీరు తలుపు వేసుకోండి" అని చెప్పి, లేవబోయివదల్లా, మళ్లీ కూలబడింది. ఆ గుడిసెలో దృశ్యం యింటిగలాయన కూడా చూస్తాడేమో, నిలబడిన వాళ్లకి కనిపిస్తుంది కూడాను. ఈ వూహరాగానే కాత్యాయనికెందుకో సిగ్గనిపించింది. ఆయన అటు చూడకుండా వుంటే బాగుండుననిపించింది.

ఇల్లుగలాయన నవ్వుతూ కాత్యాయని దగ్గరకొచ్చి. చప్పున కూలబడ్డాడు. ఆమె పక్కన చనువుగా పుస్తకాలమీద చెయ్యివేసి "అప్పుడే అయిందేమిటి చదువు? ఏం? కాసేపు చదువుకోపోనీ" అన్నాడు.

అంత దగ్గరగా ఆయన కూచోటంతో ఉక్కిరిబిక్కిరి అయింది కాత్యాయని.

"లేదండీ! వెళ్లాలి" అంటూ పుస్తకాలు లాక్కోబోయింది.

"ఉండు ఫరవాలేదు." అంటూ చేతులు పట్టుకున్నాడు.

ఒళ్లు జలదరించింది కాత్యాయనికి. ఆయన వేడిగా ఒదులుతున్న గాలిముఖానికి తగులుతూ. అసహ్యంగా వుంది లేచి నిలబడబోయింది. చటుక్కున గుంజాడు. ఒళ్లో వాలింది. అమెను అదుమిపెడుతూ,

"ఇదిగో చూడు....కూర్చో యిలా కాస్సేపు. బాగుంటుంది." ఇంకా ఏమిటెమిటో గొణుగుతున్నాడు. చేతులు ఆమె శరీరం మీద తడుముతున్నాయి. బురదమీద పడ్డట్టుగా చీదరింపు, బల్లి పాకినట్లుగా అసహ్యం, పాములు తేళ్ళు ఒంటిమీద జారుతున్నట్లు భయం, జుగుప్స అన్నీ ఒక్కసారి రేగాయి కాత్యాయనిలో. ఒక్క వూపులో బలంగా ఆయన్ను వెనక్కి తోసి, తనూ కొంత వెనక్కి పడి లేచి నిల్చుంది రొప్పుతూ. "ఛీ" గట్టిగా అనేసి పరుగున మెట్ల దగ్గరికి చేరింది. వెనకాల వస్తున్నాడేమో, అన్నట్లు తిరిగి చూసింది. అలాగే కూర్చునివున్నాడు మాట పలుకూ లేకుండాను. కొద్దిగా ధైర్యం వచ్చింది. పుస్తకాలు గుర్తొచ్చాయి. తీసుకుందామంటే మళ్ళీ పట్టుకుంటేనో? భయంగా చూసింది. మూతి మూరెడు చేసుకుని పుస్తా

పుల్తూ చూస్తున్నాడు. భయం కొంత తగ్గి, కోపం చెలరేగింది, "ఛీ! సిగ్గు లేదూ! పంది... కుక్క.....గాడిద...." కసిగా తిట్టింది.

ఏదో అనబోయి, వూరుకున్నాడు ఇల్లుగలాయన.

ఉన్న కాస్త భయం పోయింది. "అత్తయ్యగారితో చెప్తానుండు" పెంకెగా అంది అక్కడే మెట్లదగ్గరే నిల్చుని. వాడు లేస్తే పకుగు పరుగున మెట్లు దిగేయచ్చు. ఆమె వూహ అది.

"అమ్మమ్మ! కాత్యా! కాత్యా మంచిదానివి కదూ! తప్పయింది. నాది తప్పే! సరేనా. మరింకెప్పుడూ యిలా చేయను. అత్తయ్యతో మాత్రం అనకేం. యెవరిదగ్గరా అనకూడదు. ఇదిగో....నీకే మంచిది కాదు. నే చెప్తున్నాను. అనకూ....చెప్పవు కదూ యెవరితోనూ!" కూర్చున్న చోటునుండే ప్రాధేయపడ్డాడు.

"మరింకెప్పుడూ యిలా అసహ్యంగా ప్రవర్తించవుగా" ఏకవచనం ప్రయోగించింది.

"అబ్బే! యింకెప్పుడూ...." చెంపలు వేసుకోబోయి ఆగాడు.

నవ్వొచ్చేసింది కాత్యాయనికి, అంత పెద్దవాడు అలా అంత బానలా బొజ్జతో క్రింద కూర్చుని లెంపలు వేసుకుంటుంటే. పెదిమలు బిగబట్టి, కావాలని మరోసారి ఉరిమి చూపింది.

"మంచిదానవు కదూ! ఎక్కడా అనకు సుమా!" మళ్ళీ అన్నాడు.

"సరే! ఇలాంటి పన్లు చెయ్యనని దేముడి దగ్గర ప్రమాణం చెయ్యి, పూజలు చేస్తావుగా మళ్ళీను" అని వెక్కిరించినట్లు నవ్వి "నా పుస్తకాలు యిలా పడెయ్యి" అంది ఆజ్ఞాపిస్తున్నట్లు. ఆమె కంఠంలో ఏం వుందో మారు మాట్లాడక పుస్తకాలను ముందుకు గెంటాడు. "లాంతరు విసిరేవంటే విరుగుతుంది. ఆర్పేసి, నీ యింట్లో వుంచు. నే రేపు తీసుకుంటాను." అంటూ ఛెంగు ఛెంగున మెట్లు దిగితూ వెళ్ళిపోయింది.

"అమ్మ! పిల్లముండ పిసింద్రీరాబాబూ!" అనుకున్నాడు ఇల్లుగలాయన, గుండెలమీద చెయ్యి వేసుకుంటూ.

* * *

"ఒసే యిలారా" తల్లి పిల్చించి కళ్ళు చిట్లించి అనుమానంగా చూస్తూ మొహం కడుక్కోడానికి పెరట్లోకి వెళ్ళబోతున్న కాత్యాయనిని. బద్ధకంగా వళ్లు విరుచుకుని "ఎందుకమ్మా!" అంది. "రమ్మంటుంటే" అంటూ తనే దగ్గరగా వచ్చి అటు ఇటు, తిరిగి చూస్తూ, ముసిముసిగా నవ్వింది. "ఇక్కడే వుండు, ఇంట్లోకి రాకు" అంటూ హడావుడిగా "వదినా! ఓ మారిలా వస్తారా?" అంటూ ఇల్లు గలావిడ్ని పిల్చింది.

ఆవిడ వస్తూనే అయోమయంగా నిల్చున్న కాత్యాయనిని చూపి, నవ్వుతూ "అయిందీ! నేననుకుంటూనే వున్నా. పద్నాలుగో ఏడు రాలేదూ పిల్లకీ!" అంది.

"ఆ వచ్చింది మొన్ననే." అంతవరకు నవ్వుతున్న సుభద్రమ్మ ముఖం మ్లానమైంది.

"రెండో కుంపటి గుండెలమీద," అంది నెమ్మదిగా.

అర్థమైంది కాత్యాయనికి. ఏదో తెలియని భయం కోపం, చిరాకు. విసుగు అన్నీ చుట్టుముట్టాయి. తల్లి హడావుడి పడుతోంది. అప్పుడే ఇద్దరు ముగ్గురు అమ్మలక్కలు చేరారు. వాళ్ళ నవ్వులు, మాటలు కాత్యాయనికి చిర్రెత్తిస్తున్నాయి.

"ఛీ! ఏమిటీ పాడు గొడవ. ఎందుకు అందరికీ అలా చాటుతావు?" గొంతు రుద్ధమైంది.

"బాగుందే రేపు యెలాగూ నలుగురికీ తెలిసేదే!" సాగదీసింది సుభద్రమ్మ.

"అయితే?. అసహ్యంగా....పిచ్చి ఆచారాలూ నువ్వూను. అన్నీ పిగ్గులేని పనులే. ఛ! ఛ! నే నొప్పుకోను. ఇంట్లో కొచ్చేస్తానుండు. నీ పని....అప్పుడుగాని...." కాళ్ళు గట్టిగా చప్పుడుచేస్తూ, కోపంగా ముందుకి నడిచింది.

"ఆ! ఆ! వూరుకోవే తల్లీ. నువ్వు మరీ మొండిఘటానిలా తయారయావు. సర్లే! యింకెవరితోనూ చెప్పనుగాని ఈ నాల్రోజులూ నా మాట విను." ప్రాధేయపడింది సుభద్రమ్మ.

"పేరంటం గీరంటం పెట్టవుగా!"

"పెట్టను. నాకు మాత్రం ఓపిక ఏడిసిందేమిటి?"

సరస్వతి చెల్లెల్ని చూస్తూ ముసి ముసినవ్వులు నవ్వింది.

"ఛ! నవ్వు ఎలా వస్తోందే అక్కా- నీకు చదువు మానిపించి మూల కూచోబెట్టారుగా. పెళ్ళి పెళ్ళి అంటూ అడ్డమైన గాడిదల్ని కాఫీ టిఫిన్లు యిచ్చి మేపి పంపుతున్నారు. ఇలాంటి అవస్థ రేప ట్నుంచీ నాకూ వస్తుంది కాబోలు. పిచ్చి వేషాలేశారంటే ఈ సర స్వతి మెద్దులా నే మాత్రం పడుండను. జాగ్రత్త," కాత్యాయని గట్టిగా అరచి మరీ చెప్పింది. వెర్రికోపంతో మొహమంతా ఎర్రనై కళ్ళు పెద్దవయ్యాయి. పిడికిళ్ళు బిగించి మరీ చెప్పింది.

"చూశారా వదినగారూ, దీని వరస. అదేం కోపమో తెలి యదు, పిచ్చికోపం. నోటికొచ్చినట్లు మాట్లాడేస్తుంది. ఎవరేనా వింటే ఏమనుకుంటారు చెప్పండి"

ఇల్లుగలావిడ కాత్యాయని వంక జాలిగా చూసి నవ్వింది.

"పోనీండి సుభద్రమ్మా! చిన్నపిల్ల. ఇంకా తెలిసీ తెలియని వయసు. పైగా కాత్యాయనికి ఏ వొచ్చినా పట్టలేం కదా! మనసులో వుంచుకోలేదేదీను" అని సుభద్రమ్మతో మెల్లగా అంది. "తన ఇష్టం వచ్చినట్లే కానీండి, వూరికే హైరాన పడి అవీ, ఇవీ అంటూ గడబిడ చేయకండి. కొన్ని కొన్ని ఆచారాలు మనం వదిలేయకపోతే లాభంలేదు. స్కూలుకెళ్ళే పిల్ల, సిగ్గుగా వుంటుంది. వీధంతా పిలిచి పేరంటం వగైరాలు పెట్టుకోకండి. ఏం జరగనట్టు మామూలుగా మనం వుంటే తనకే ఆ కోపం, విసుగు తగ్గుతాయి. ఇలాంటి సమయాల్లో వాళ్ళ మనసు అలాగే వుంటుంది. చెప్పలేని చికాకు, భయమూ, అదీను. మనం కాస్త ఛాదస్తాలు వదులుకుంటే, వాళ్ళకీ సుఖం, మనకీ సుఖం."

"సరేలెండి. రోజులు మారుతున్నాయి. మనమూ మారక తప్పదు" సమాధాన పడింది సుభద్రమ్మ.

'ఎలాగైనా యింటావిడ మంచిది' మనసులోనే మెచ్చుకుంది కాత్యాయని. 'కాని ఆ బొండామే ...నిన్న రాత్రి....' తల్చుకుంటే మళ్ళీ చేదుగా వుంది. అసలు వాడిని గుంజీలు తీయమని అని వుంటే

యెలా వుండేదో? తీస్తాడా? ఆ! తియ్యకేం చేస్తాడు? అత్తయ్య గారితో చెప్తానంటే సరి....' ఇల్లుగలాయన తన భారీ శరీరంతో, వినాయకుడిలాంటి బొజ్జతో గుంజీలు తీయడం వూహించేసరికి, కాత్యాయనికి నవ్వు ఆగలేదు.

"ఏరా! రిజల్టు వచ్చినట్టున్నాయి!" వెంకట్రావు కాఫీ తాగుతూ కొడుకుని అడిగాడు.

చేతిలో వున్న పేపరు తండ్రి కందిస్తూ "ఊ!" అన్నాడు రంగారావు.

"ఏమయిందేమిటి?" ఏమయిందో . రంగారావు మొహం చూస్తే తెలుస్తూనే వుంది.

ఆ మాటే అన్నది ప్రక్కనే వున్న కాత్యాయని.

"మొహం చూస్తే తెలియటం లేదూ....నాన్నా! చెప్పెక్కింది."

ఉడుకుమోతు తనంగా చూశాడు రంగారావు.

వెంకట్రావు యేం మాట్లాడక, కాఫీ తాగడం పూర్తిచేశాడు.

తండ్రి తిడతాడేమో అని భయంగా చూస్తున్న రంగారావు ఆశ్చర్యపోయాడు. కాత్యాయనికి కూడా ఆశ్చర్యంగానే వుంది తండ్రి మౌనం.

కొంతసేపు అలా కూర్చుని, కుర్చీలోంచి లేచి రంగారావు దగ్గరగా వెళ్ళి, అతని కళ్ళలోకి చూస్తూ శాంతంగా చెప్పాడు వెంకట్రావు.

"నువ్వేదైనా వుద్యోగం చూసుకో!"

"నా....నాన్నా....వుద్యోగమా!"

"అవును."

"ఎవరిస్తారు నాన్నా?" అయోమయంగా అన్నాడు.

"ఎవడిస్తాడో....అదే చూసుకోమంటున్నాను. ఏ వుద్యోగమైనా సరే....! చివరకు యే ఆఫీసులోనైనా ప్యూన్‌గా చేరినా సరే...."

అప్పుడే అటుగా వచ్చిన సుభద్ర తెల్లబోయింది.

"అదేమిటండీ అతి అంటారూ! ప్యూన్ వుద్యోగ మేమిటండీ?"

"ఏం, ప్యూనయితే ఏమొచ్చింది? గుమాస్తాలకంటె ఎక్కువ జీతాలే వస్తున్నాయి కొన్నిచోట్ల ప్యూన్సకి. అయినా తిని తిరగడం కంటె యే వుద్యోగమైనా మేలే!"

రంగారావు ముఖం నల్లగా మాడిపోయింది.

"వాడి ఖర్మ! ఎన్నిసార్లు పరీక్షకి వెళ్ళినా పోతూనే వుంది. వాడు మాత్రం యేం చేస్తాడు పాపం!" సుభద్రమ్మకి జాలి కొడుకు మీద.

ఖస్సుమన్నాడు వెంకట్రావు. ఇంతదాకా తెచ్చిపెట్టుకున్న శాంతం ఆమడదూరం పారిపోయింది.

"వాడి ఖర్మకాదే? మన ఖర్మ. చచ్చు బి. ఎ. పాసవలేక పోతున్నాడు వీడు. బడుద్ధాయి. శ్రద్ధ వుంటే కదా! ఎంతసేపూ స్నేహితులు, సినిమాలు. ఇది మూడోసారి ఫేలవడం. ఇక నే భరించలేను. మహా మహా డిగ్రీలున్నవాళ్ళకే ఉద్యోగాల్లేవు. బి. ఎ. డింకీ కొట్టాడు. వీడికేం వస్తుంది? ఇంకా పరీక్షలకి కూర్చుంటూ వుంటే, ఆ పాతికేళ్ళు కూడా దాటిపోతాయి. అందుకే అంటున్నాను. ఎలాటి చిన్న వుద్యోగమైనా సరే. చూసుకు చేరిపోరా అని. బుద్ధి వుంటే ప్రైయివేటుగా కడతాడు. అసలీ చదువు ఆ సరస్వతికేనా చెప్పించానుగాను. ఫస్టుగా పాసయి ఈపాటికి....ఏ వుద్యోగంలోనో చేరి వుండేది. అనవసరంగా మగపిల్లవాడని చెప్పి, వీడికి తగ లెట్టాను డబ్బంతా."

చిన్నబోయిన కొడుకు ముఖం చూస్తూ "ఇక వూరుకోండి. జరిగిందేదో జరిగింది" అనేసి వెళ్ళిపోయింది సుభద్రమ్మ.

తండ్రి అలా వెళ్ళగానే, అన్నగారి దగ్గిరకి వెళ్ళింది కాత్యాయని.

"అంటే నీకు కోపమొస్తుందిగాని శ్రద్ధగా ఏ రోజైనా చదివావురా నువ్వు? ఎంతసేపూ స్నేహితులు, సినిమాలూను."

"నోర్ముయ్! పెద్ద ఆరిందాలా చెప్తున్నావు. నీకు కూడా అంత

లోకువగా వుందా....?" తండ్రిమీద కలిగిన కోపం చెల్లిమీద చూపించాడు.

కాత్యాయని తగ్గకుండా అంది. "ఆ! లోకువే. తప్పకుండా వుంటుంది. నాన్న అంత కష్టపడి, సంసారాన్ని లాక్కువస్తూవుంటే నువ్వు హాయిగా తిరుగుతూ పరీక్షలు ఫేలవుతూ కూర్చోడానికి సిగ్గు లేదూ! ఈపాటికి నాన్నకి యెంతో సహాయంగా వుండవలసినవాడివి. నీ గురించి అక్క చదువు పాడుచేశారు. అది గోళ్ళు కొరుక్కుంటూ ప్రేమ కథలు, నవలలు చదువుకుంటూ కాలక్షేపం చేస్తోంది."

"నేనేమైనా కావాలని ఫెయిలవుతున్నానా?"

"కావాలని అవరు. కాని అసలు ప్రయత్నమనేదే గట్టిగా చెయ్యాలి. ఆ తరువాత యేం జరిగినా, 'మన బాధ్యత లేదు' అని సరిపెట్టుకోవచ్చు. నీలో ఆ పట్టుదలే లేనప్పుడు ఏం చేస్తాం?"

సరస్వతి వింటూ నిల్చుంది కాత్యాయని మాటలు. 'తనకంటె చిన్నది అన్నని ఎదిరించి యెలా మాట్లాడుతోందో? అసలు దాని మాటలన్నీ అలాగే వుంటాయి. చిన్నప్పటినుంచీ దాని తీరే వేరు. ఇంట్లో అంతా దాని నోటికి ఝడుస్తారు. అది చెప్పినట్లు తను నవలలు చదువుతూ, గోళ్ళు గిల్లుకుంటూ కాలం వృధా చేస్తోంది. కాని యేం చేయడం? యింట్లో పని, అది లేనప్పుడు యివీ. ఇదే కాలక్షేపం తనకి?'

గుమ్మాని కానుకుని నిలబడి, తమ వేపే కళ్ళప్పగించి చూస్తున్న అక్కగార్ని చూసి "ఇదో గంగిగోవు" అనుకుంది కాత్యాయని. అసలు అక్క అలా టైమ్ వేస్ట్ చేయడం తన కిష్టం లేదు.

చటుక్కున యేదో గుర్తు వచ్చినట్లు "అవును గాని, అన్నయ్యా మన వెనకవీధిలో కొత్తగా టైప్ ఇనిస్టిట్యూట్ ఒకటి పెట్టినట్లున్నారు" అంది.

"ఔనూ!" మూతి బిగించుకునే వున్నాడు రంగారావు.

"నువ్వూ, అక్కా వెళ్ళి ఆ టైపేనా నేర్చుకోకూడదూ? ఎందుకేనా పనికొస్తుంది."

"నిజమేనే కాత్యా! నేను నేర్చుకుంటాను. ఇంట్లో కూర్చుని విసుగెత్తిపోతోంది" సరస్వతి ఆశగా అంది.

"అలా అనకపోతే.... నువ్వు ప్రయివేట్‌గా కట్టొచ్చు కదా! హిందీ చదవచ్చు, కుట్లు నేర్చుకోవచ్చు."

"అబ్బ! వినేవాళ్ళుండాలి కాని, పెద్దా పేరక్కలా ఎన్నైనా చెప్తుంది. నువ్వు చెయ్యి ఈ పనులన్నీను." రంగారావుకి కోపం యింకా తగ్గలేదు.

సవాలు చేస్తున్నట్లుగా అంది కాత్యాయని.

"ఏం? తప్పకుండా చేస్తానురా! ఏం బ్రహ్మవిద్యలా యివి? ఈ టెన్తు క్లాసు పరీక్షలవనీ, శలవుల్లో నేనూ టైప్ కెళతాను. నీలా గనుకున్నావా? ఏదో వుద్యోగం చూసుకుని, నాన్నకి సహాయపడ తాను. ఆ తర్వాత.... ఆ తర్వాత ..."

"ఊ! ఆ తర్వాత.... పెళ్ళి చేసుకుంటావా?"

"భలే! బోడి పెళ్ళి. పెళ్ళి యెవడిక్కావాలి. నాకూ ఎమ్.బి. చదవాలని చాలా యిదిగా వుందిరా! కుదురుతుందంటావా?" కాత్యా యని ముఖంలో అంతవరకున్న పెంకితనం పోయి, జాలిగా అడిగింది.

ఏదో వేళాకోళం చేయబోయిన రంగారావు, ఆమె ముఖం చూసి టక్కున ఆగాడు. వయసుకి మించిన మాటలు మాట్లాడుతుంది కాత్యాయని. అవికారంగా, దురుసుగా వుంటుంది ఆమె ప్రవర్తన. ఇలా దీనంగా చెల్లెలి ముఖం చూడ్డం ఇదే మొదటిసారి. మనసులో కలుక్కుమంది రంగారావుకి. తప్పు చేసినట్లు అనిపించింది. దాని కెంత శ్రద్ధ చదువుమీద! పాపం డాక్టరవ్వాలని కలలు కంటోంది కాబోలు. తామున్న పరిస్థితులలో.... అది.... కలే! చెల్లెలిమీద జాలి, అభిమానం పొంగాయి. అంతవరకు తను పడ్డ సూటిపోటి మాటలు మరిచిపోయాడు. నాన్న చెప్పినట్లు ఏదో ఓ చిన్న ఉద్యోగం చూసు కుని చెల్లెల్ని చదివిస్తే? ఆలోచిస్తూ, అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు రంగారావు.

*          *          *

కాత్యాయని పట్టువల్ల సరస్వతి టైప్ యిన్స్టిట్యూట్లో చేర గలిగింది. లోయర్ పాసయింది. హైయ్యర్‌లో పరీక్ష పోయింది. సిగ్గుతో వెళ్ళనంటే కాత్యాయనే బలవంతంగా మళ్ళీ కట్టించింది పరీక్షకి. ఇంటర్‌కి కూడా చదవడం ప్రారంభించింది సరస్వతి.

* * *

రంగారావు ఉద్యోగాన్వేషణలో వున్నాడు. పెరిగే ధరలు పిల్లలు ఎదుగుతున్నకొద్దీ ఎక్కువవుతున్న ఖర్చులు, నానాటికీ ముదురు తున్న సుభద్రమ్మ అనారోగ్యం వెంకట్రావుని క్రుంగదీస్తున్నాయి.

"అమ్మా! అమ్మా!" సంతోషంగా కేకేస్తూ పరిగెట్టుకుంటూ వచ్చింది కాత్యాయని.

"ఏవిటే! ఏమిటా పరుగు? అవ్వ, ఆ వోణీ ఎందుకే అసలు వేసుకోడం...."

"అబ్బ! వూరుకుందూ కాసేపు. అస్తమానూ నా ఓణీమీదే వుంటుంది నీ దృష్టి. ఇంతకీ నే చెప్పేది వినడం వుందా, లేదా?...."

"చెప్పు."

"నేను పాసయ్యాను. ఇదిగో రిజల్ట్సు వచ్చాయి."

"అలాగా! నీకేం? నువ్వు పాసవుతావని ముందే తెలుసు." మురిపెంగా కూతుర్ని చూస్తూ అంది సుభద్రమ్మ.

"వట్టి పాస్ కాదు. చూస్తూ వుండు, మార్కులొచ్చాకా. నైన్టీ పర్సంట్‌కి తక్కువ రాదు."

"అబ్బో! గొప్పలు చెప్పుకుంటున్నావే!"

"చిన్నన్నగారా! గొప్పలే మరి! నీకొచ్చాయా చెప్పు ఫస్టుక్లాస్ మార్కులు?" ఎదురు ప్రశ్న వేసింది. రామం కాత్యాయని కంటె ఓ యేడాది పెద్దవాడు. ప్రస్తుతం యింటర్ మొదటి సంవత్సరంలో వున్నాడు.

"అందరినీ యేదో ఒకటి అనడమే పని నీకు" సరస్వతి మందలింపుగా అంది.

"ఉన్నమాటంటే అలాగే వుంటుందిలే. అమ్మా! ఇవాళ

పాయసం చెయ్యి. సుశీలని తీసుకొస్తాను."

"ఆ పిల్ల పాసయిందిటే!"

"ఆ! నే మళ్ళి వస్తానుండు యిప్పుడు! వాళ్ళింటికి వెళ్ళి వస్తాను."

* * *

"మామయ్యగారూ, సుశీలేదీ?" హుషారుగా లోపలకి అడుగు పెట్టింది. పార్వతి, ప్రకాశరావు నవ్వు ముఖంతో ఎదురొచ్చి, అభినందించారు కాత్యాయనిని.

ప్రకాశరావుకి కాత్యాయని అంటే అభిమానం. "ఆ పిల్ల మంచి చురుకు. తెలివిగలపిల్ల. అవకాశం వుండాలిగాని చక్కగా రాణిస్తుంది" అంటాడు.

"కాని దురుసు" అంటుంది పార్వతి నవ్వుతూ.

"ముక్కుకు సూటిగా పోయేవాళ్ళూ, బోలా మనుషులు యిలాంటి బిరుదే సంపాదించుకుంటారు. వాళ్ళ వీధిలో వాళ్ళ నడుగు, "ఆ అమ్మాయికి మిడిసిపాటు ఎక్కువ. మహా గర్వం.ఆడపిల్లని చెప్పి అణకువ లేదు. మగరాయుడిలా విరగబాటు" అంటారు."

"ఏం మీపరేనా అన్నారా అలా?"

"ఆ! ఏదో మాటల సందర్భంలో యిద్దరు ముగ్గురు నోట విన్నాను."

"ఏమో బాబూ! మన సుశీల స్నేహం...."

"అటువంటి మాటలే వద్దన్నాను. కాత్యాయని రత్నంలాంటి పిల్ల."

"చూడగా చూడగా మీకు సుశీల కంటె ఆ పిల్లే ఎక్కువలా వుందే!"

"పిల్లిగా మాట్లాడకు పార్వతీ."

కాత్యాయని, సుశీల నవ్వుకుంటూ వచ్చారు.

"అమ్మాయి లిద్దరికీ ఈవేళ పండగే" అంది నవ్వుతూ పార్వతి.

"సుశీల యీవాళ మా యింటికి వస్తుంది అత్తయ్యా! ఏం?"

"తప్పకుండాను. ఏం స్పెషల్ చేయించావేమిటి? మాకు లేదా పార్టీ?" ప్రకాశం కల్పించుకున్నాడు.

"బీదవాళ్ళం, మేం ఏం స్పెషల్ చేయించగలం చెప్పండి మామయ్యగారూ!"

"ఛ, అవేం మాటలమ్మా?" యింకేమనాలో తెలియలేదు ప్రకాశానికి.

"బీదేమిటి గొప్పేమిటి స్నేహానికి" పెదవుల చివరనుంచి వచ్చిన మాటే అయినా, పార్వతి అనగలిగింది—కాత్యాయని కోసం.

"మీ మామ్మగారికి యెలా వుంది?" మాట మార్చింది.

"మా మామ్మ యమభటులకోసం ఎదురుచూస్తోంది. వాళ్ళు రారు. ఈవిడ వెళ్ళదు."

"తప్పు కాత్యాయనీ! అవేం మాటలూ?"

"వినడానికి కష్టంగానే వుంటుందిగాని అత్తయ్యగారూ.... ఆవిడ వున్నందువల్ల యెవరికేం ప్రయోజనం చెప్పండి?"

ప్రకాశం "ప్రయోజనం వుంటేనే బ్రతకాలంటావా? అలా అయితే....మనం అంతా...."

"ఆగండి మామయ్యగారూ, మీరలా అంటారని నాకు తెలుసు. ఆ వుద్దేశ్యంతో అనడంలేదు. ఆవిడ చూడండి. జబ్బుతో లేకలేక మంచంమీద ఉండి, తీసుకుంటోంది ఏడాదిబట్టీను. ఆవిడకి అన్నీ మంచంమీదే జరపాలి. ఆ సేవ చేయిలేక అమ్మ, అక్క ఎంత విసుక్కుంటారో తెలుసా? నాకూ పడుతుంది అప్పుడప్పుడు ఆ డ్యూటీ. నిజం చెప్పాలంటే. నేను విసుక్కోను. జాలేస్తుంది నాకు. బ్రతుకుమీద ఆవిడకి ఆశలేదు. ఆవిడ మందులకయ్యే ఖర్చుతో, మా ఆఖరి చెల్లాయికి పాలు వస్తాయి నెల పొడుగూతాను. అలా అని మందులు కొనకుండా మానలేడుగదా మా నాన్న, ఈ కరువురోజుల్లో, యీ యిబ్బందుల్లో....ఇంట్లో అందరూ కూడా, పైకి అనకపోయినా ....లోపల యీ పీడ విరగడైతే బాగుండునురా బాబూ అనుకుంటూ

వుంటారు."

"కాని మానవత్వం, సానుభూతి అనేవి వుంటాయమ్మా!"

పకపకా నవ్వింది కాత్యాయని.

"అవి వున్నాయి గనుకనే ఇంకా భరిస్తున్నాం మామయ్యగారూ. లేకపోతేనా, ఈపాటికి ఇన్ని గార్డినాల్ మాత్రలు కొనుక్కొచ్చి. 'దగ్గుమందు ఇదిగో మామ్మా!' అంటూ ఇచ్చేసి వుండక పోయానా? మెత్తగా పొడిగొట్టి, నీళ్ళలో కలిపేసి."

పార్వతి, ప్రకాశం నవ్వకుండా ఉండలేకపోయారు.

"ఇక్కడే భోంచేయి యివాళ."

"వద్దు....వద్దు...." సిగ్గుపడింది కాత్యాయని.

"అమ్మయ్య! కాత్యాయనిని మామూలు ఆడపిల్లలా చూడాలంటే, భోంచేయమని అడిగితే చాలు" అంది పార్వతి నవ్వుతూ.

"అయితే, మామూలు ఆడపిల్లను కానంటారా అత్తయ్యా"

"మామూలు ఆడపిల్లకావు కాత్యాయనీ! వరాల మూటవి. ముత్యాల మతాబావి." ముచ్చటగా చూస్తూ అన్నాడు ప్రకాశం.

"మీ మామయ్యగారికి నువ్వంటే ముద్దూ."

"ఆ మాట మాత్రం అనకండి బాబోయ్. అదంటే నాకు చేదూ."

ఫక్కున నవ్వారు అందరూను.

ఆ రోజు మధ్యాహ్నం మూడు గంటలదాకా సుశీలతోనే గడిపింది కాత్యాయని.

రామం వగరుస్తూ వచ్చాడు. చూడగానే "ఓ! మర్చేపోయాను. అమ్మని పాయసం చేయమన్నాను. ఇక్కడే మీ మాటల్లోపడి కూర్చుండిపోయాను. రా సుశీ! మా యింటికి వెళ్దాం. నే పెట్టే స్వీట్ కూడా తిందుగాని."

"పాయసం లేదు నీ మొహం లేదు. మామ్మ చచ్చిపోయింది తెలుసా! యింటికి రా!" ఆయాసపడుకూ కసిరినట్టుగా అన్నాడు రామం.

"ఆ!" ఆశ్చర్యంతో నిలబడిపోయింది కాత్యాయని. కళ్ళలో

గిర్రున నీరు తిరిగింది.

అంతలో లోపల్నించి వచ్చారు పార్వతీ, ప్రకాశమూను. సంగతి విని. సానుభూతి ప్రకటించేరు.

"చూసొద్దాం" అనుకున్నారు. వారి స్నేహం కాత్యాయని వరకే పరిమితం. అయినా పరిచయం లేనివాళ్ళు కాదుగా, వెళితే ఏం పోయింది అనుకున్నారు.

"ఏమ్! పిల్లా, అదేంటే .... ఆ కళ్ళల్లో నీళ్లు. ఇందాకట్నుంచి కబుర్లుచెప్పి...." అంటూ పార్వతమ్మ కాత్యాయనికి అదిలింపుగా అంది చనువు సూచిస్తూ.

బుగ్గలమీదపడిన కన్నీటిని ఓ సారి తుడిచేసుకుని నవ్వేసింది కాత్యాయని.

"ఈ వేళ రెండు శుభవార్తలు. భలే!" అనేసి, రామం వెంట నడిచి వెళ్లిపోయింది వడివడిగా.

"భలే పిల్లండీ" పార్వతి అటే చూస్తూ అంది.

* * *

"అమ్మా టైపుకి వెళుతున్నాను" కాత్యాయని వోణీ పొడుగు ఎంతుందో. చూసుకుంటూ అంది.

"నువ్వానా? ఎప్పుడు చేరేవేమిటి? అక్క ముందు వెళ్ళిపోయింది. దానితోపాటు వెళ్ళకపోయావా?"

"మేష్టారిప్పుడే వస్తాడమ్మా! రేపట్నించి చేరుతానని చెప్పి రావాలి. అందుకోసమే వెళ్తున్నాను."

ఇనిస్టిట్యూటిలో అడుగు పెడుతూనే "ఎవరూ లేరేమిటి చెప్మా!" అనుకుంది. వరసగా నాలుగు టైపు మిషన్‌లు కొత్తవి, నిగనిగలాడుతూ వున్నాయి, "అక్కేదీ!" అనుకుంటూ ముందుకు వెళ్ళింది. మిషన్సు ఉన్న గదికి యెడంప్రక్కగా మరో తలుపువుంది. అది దగ్గరగా వేసివుంది. 'లోపల ఎవరేనా వున్నారేమో పిలుద్దాం' అనుకుంటూ తలుపుమీద చేయి వేసింది. అంతలోనే లోపల్నుంచి సరస్వతి కంఠం వినిపించింది.

"ఎన్నాళ్ళు బాబూ ఇలాగ, నాకు భయంగా వుంది. ఎవరికేనా

తెలిస్తే నా బ్రతుకేమవుతుంది?".

బదులుగా చిన్న నవ్వు. యెవరో? స్థాణువులా నిల్చుంది కాత్యాయని. "ఎందుకు భయం. ఎవరికేం తెలుస్తుంది. ఈ మేడ మీద మూల గదికి ఎవరూ రారు. చుట్టుపక్కల యెవరికీ తెలియదు. నువ్వు టైప్ నేర్చుకుందికి వస్తున్నావని అందరికీ తెలుసు. ఇక అనుమానించవలసిన పని యెవరికుంది?" మగ కంఠం అనునయంగా పలికింది.

"అయినా సరే బాబూ, మన మాట మీ వాళ్ళతో త్వరగా చెప్పండి. వాళ్ళేమయినా అభ్యంతరం పెడితే .... అప్పుడేమిటి నా గతి...."

"ఎన్నిసార్లు చెప్పినా నీ కిదే భయమా! చెప్పానుగా సరస్సూ నిన్ను యెలాగయినా పెళ్ళిచేసుకు తీరతానని. ఏదీ కాస్త నిలదొక్కుకోనీ....ఇప్పుడేగా ఇన్‌స్టిట్యూట్ పెట్టింది. కాస్త సంపాదించనీ... అప్పుడు...."

"ఊ అప్పుడూ...."

"అప్పుడా...."

సరస్వతి కిలకిలా నవ్వడం వినిపించింది. తలుపుమీద దబ దబ బాదింది కాత్యాయని.

కంగారుగా తలుపు తీసుకుని బయటికి వచ్చాడు కేశవరావు. అతనిదే ఆ ఇన్‌స్టిట్యూట్.

"మీరు....మీరు...." అతనికి కంగారులో మాట తోచలేదు.

"ఆ గదిలో వున్న దానికి చెల్లెల్ని." పళ్ళు బిగించి భీకరంగా చూసింది.

"ఎంత కోపంరా బాబూ!" అనుకుని తెల్లబోయాడు. 'సరస్వతి చెల్లెలా! అమ్మయ్య మరేం పరవాలేదు' తేలికపడ్డాడు కాస్త. చిరునవ్వు తెచ్చుకుంటూ "ఆ!ఆ! సరస్వతిగారూ! మీ చెల్లెలు వచ్చింది."

పాలిపోయిన మొహంతో, తలవంచుకుని తలుపు దాకా వచ్చి చెల్లెలి కళ్ళలోకి చూడబోయింది.

మొహం అంతా ఎర్రగా కందిపోయింది కాత్యాయనికి. పిడి

కళ్ళు బిగుసుకున్నాయి. కళ్ళు పెద్దవిచేసి చూస్తూ, "ఇన్‌స్టిట్యూట్ శలవా ఈవేళ?" అడిగింది.

"ఆ....ఆ....అవును. అవును." క్రాప్ సరిచేసుకుంటూ అన్నాడు.

"అక్కకి మాత్రం స్పెసల్ క్లాసేమిటి?" వ్యగ్యంగా అంది. చాచి లెంపకాయ కొట్టినట్టయింది యిద్దరికీను, "అదే....అదే వాళ్ళో! ఫుట్‌బాల్ మేచ్ ఉందని మిగిలిన ముగ్గురు కుర్రాళ్ళూ రాలేదు."

కేశవరావుకి చిన్నతనంగా ఉంది 'ఈ చిన్నపిల్ల ముందు దోషిలా నిలబడవలసివచ్చిందే' అని. విసుక్కున్నాడు లోలోన. సరస్వతిలా అమాయకురాలిలా లేదు. కాశికలా ఆ చూపులూ అదీ, పిల్లా-పిడుగా అన్నట్లుగా వుంది. ఎలా యెదుర్కోవడం యీ సిట్యుయేషన్ ఆలోచిస్తున్నాడు అతను.

"నేనూ టైప్ నేర్చుకుందామని వచ్చాను," ఇదీ వ్యంగ్యమేమోనని తలెత్తి పైకి చూశాడు.

"కాని....ఆడపిల్లలకి ఆ గదిలో పాఠాలు నేర్పుతారని నాకు తెలియదు"

కేశవరావుకి కోపం వచ్చింది. "ఏమిటి నీ మాటలు," అన్నాడు గద్దించినట్టుగా.

సరస్వతి చటుక్కున ముందుకు వచ్చి "ఇంటికి పద పద నే చెప్తాగా! ముందుకు కదులు" అంటూ లాక్కుపోసాగింది.

"ఉండవే! ఆ సంగతేమిటో' కాత్యాయని మాట వినకుండానే "నువ్వు రా....రా....చెప్తాను" అంటూ పరుగులా నడవసాగింది.

"ఏమిటక్కా అదీ! ఏవిటి మీ మాటలు?" పెద్దదానిలా అడుగుతున్న చెల్లెలి ముందు, సిగ్గుపడింది సరస్వతి.

"అతను....అతను నన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడే"

"నువ్వు నమ్మేశావా?"

"చాలా మంచివాడే అతను."

"అందుకేనేమిటి అలా దొంగ వేషాలు!"

"కాత్యా?" పెదవులదిరాయి సరస్వతికి.

"నన్నింత అవమానం చేస్తావనుకోలేదు."
"అతన్నంటే నిన్ను అవమానం చేసినట్టా."
"కాదా మరి?"
"కాని అతను నిన్నెంత అవమానిస్తున్నాడో నీకు తెలియదేమో బహుశా!"
"కాత్యా ఇంక చాలించవే! నాకే చెప్తావా నువ్వు? చూస్తున్నాగా చిన్నప్పట్నించి ఇంతే నువ్వు. అమ్మ వాన్న అలుసిచ్చారు. మరీ బండబారిపోయావు. పెద్ద చిన్న లేకుండా వాగుతావు. అన్నీ నీకే తెలుసుననుకుంటావు. పదిహేనేళ్లున్నాయో లేదో .... పెద్ద ముత్తైదువలా కబుర్లు చెప్తావు. నా మంచి నాకు తెలియదనేనా.... నాకు....చెప్పవస్తున్నావు." ఆవేశపడింది సరస్వతి.
"నీకు చెప్పవస్తున్నానని కోపం తెచ్చుకోకు అక్కా. ఎందుకో ఆ కేశవరావుని చూస్తే నాకు యిష్టం లేదు."
"కాత్యా" అంటూ తల్లి పిలవటంతో లేచి వెళ్ళింది.

* * *

సరస్వతితోపాటు కాత్యాయనీ వెళ్తోంది యిప్పుడు.
కేశవరావుని చూస్తూనే ముఖం చిట్లిస్తుంది కోపంగా.
సరస్వతి కిప్పుడు అతనితో ఏకాంతం దొరకటం లేదు కాత్యాయని మూలంగా. కేశవరావు కూడా ఏమనుకున్నాడో ఏమో .... ఆమెతో కొత్తగా ప్రవర్తిస్తున్నాడు. దూరదూరంగా వుంటున్నాడు. అది గమనించారు అక్కా చెల్లెళ్ళిద్దరూను. సరస్వతికి అతని విముఖత్వం చూపినప్పుడల్లా గుండెల్లో శూలంతో పొడిచినంత బాధగా వుంటోంది. ఈలోగా ఆమె హైయర్ పరీక్షలు రాయడమూ, ఇన్‌స్టిట్యూట్ విడిచిపెట్టడమూ జరిగింది. కేశవరావు మౌనంగా వున్నాడు. రిజల్టు వచ్చాయి. పాసయ్యానని చెప్పడానికి వెళ్ళింది సరస్వతి. అక్క బయలుదేరడం చూసి 'ఎక్కడకి' అని అడగబోయి మానేసింది కాత్యాయని. తిరిగివచ్చిన సరస్వతి కళ్లు ఉబ్బిపోయి, మొహమంతా వాచివుంది. తలెత్తలేనట్లు తిన్నగా వెళ్ళి మంచంమీద బోర్లా పడిపోయింది. తుఫానుకి వేళ్ళతోసహా పెకిలించ

బడి, నేలవాలిన మొక్కలా వుంది.

కాత్యాయని "వేయి పడగలు" చదువుతోంది వరండాలో కూర్చుని. అక్క వెళ్లడమూ, ఆమె తీరు చూసి, ఏదో అర్థమైనట్లనిపించింది.

"ఏమే! సరస్వతీ! వెళ్లి మీ మాష్టరికి చెప్పొచ్చావా పాసయ్యానని" సుభద్రమ్మ అడుగుతోంది.

అమ్మ వంటింటికి అంకితమైపోయిన ఓ యంత్రం అనుకుంది కాత్యాయని.

"అదేమే గొంతు అలా వుంది?"

"ఏం కాదమ్మా తలనొప్పి యెక్కువగా వుంది."

సరస్వతి గొంతు రుద్ధంగా వినిపించింది.

తల్లి ఆందోళనగా అంది. "అయ్యో! కళ్లుకూడా ఎర్రగా వున్నాయి. అంత నెప్పి యెందుకొచ్చిందే! ఆ గూట్లో అమృతాంజనం వుందేమో, రాస్తానుండు."

"వద్దమ్మా! నీ పని చూసుకో! అదే తగ్గుతుందిలే."

"పోనీ నువ్వేనా రాసుకో!"

"అలాగే" ఏడుపు దిగమ్రింగుకున్నది సరస్వతి.

చట్టున లేచి ఇన్‌స్టిట్యూట్ వేపు వెళ్లింది కాత్యాయని.

ఒక్కడూ కూర్చుని కాగితాలేవో చూసుకుంటున్నాడు కేశవరావు.

"ఏం సార్! ఏం చెప్పారు మా అక్కతో."

ఆశ్చర్యపోయాడు. పౌరుషం పొంగింది. ఆఫ్టరాల్ ఇంటర్ చదువుతున్న ఈ పిల్ల, ఓ గుమాస్తా కూతురు తనని బెదిరించడమా?

"ఏం సంగతి?" నిర్లక్ష్యంగా తల యెగరేసి అడిగాడు.

"అదే పెళ్లి సంగతి!"

"పెళ్లా! పెళ్లా" జోక్ విన్నట్టు నవ్వాడు.

వళ్లు మండింది కాత్యాయనికి "ఏవిటా వెకిలి నవ్వు."

"లేకపోతే ఏమిటి నీ ప్రశ్న. నాకు ఏభై వేల కట్నం యిచ్చి పిల్లనిస్తామంటుంటే....నీ అక్కను చేసుకునే గతి నాకేం పట్టింది?"

పిడికిలి బిగించి బల్లమీద గట్టిగా గుద్దింది. కాగితాలు అల్లంత దూరాన యెగిరిపడ్డాయి. అదిరిపడి లేచాడు.

"ఏమిటి నీ ధైర్యం! ఆడపిల్లవి యింత...."

"స్కౌండ్రల్" అతనింకా ఏదో అనబోతుండగానే అరిచింది.

"పరమ మూర్ఖుడివి. పిరికి సన్నాసివి. డబ్బాట డబ్బు. ఆ బురదలోనే పొర్లు పందిలాగా," అసహ్యం నిండిన చూపులతో ఏవగింపుగా అంది.

అంతకన్న ఏం చేస్తుందిలే అని ధైర్యంగా చూశాడు. గొంతు సవరించుకుని హితబోధ చేశాడు.

"చూడమ్మాయ్! ఇలా గొంతు చించుకుని అరిస్తే మీకే నష్టం. ఆడపిల్లలు, మీరు జాగ్రత్తగావుండాలి కాని మగాడికేం. అలుసివ్వడం మీది తప్పు. తెలివైనదానివి మీ అక్కకంటేను. ఇది చాలను కుంటాను నీకర్థం అవడానికి."

అతని మొండి ధోరణికి విస్తుపోయింది. ఎంత ధైర్యంగా చెప్తున్నాడు. తామున్న స్థితిగతులవల్ల కదా వీడికింత ధైర్యం కలిగింది. తాము ఏమన్నా నలుగురూ తమనే తప్పు బడతారు. ఆడపిల్ల అనగానే అంత లోకువ. ఛ! ఇదేం పద్ధతో ఇవేం రూల్సో!

కేశవరావు తలవంచుకుని, ఆమె వేపు చూసీ చూడనట్టు చూస్తున్నాడు. 'ఇంకా ఏమంటుందో? తండ్రి వరకూ వెళ్ళకుండదు వెళ్తే.. ఇలా వుండదు పరస. వెళ్ళదు కూడాను' మరీ నిబ్బరంగా వున్నాడు.

"పరమ నీచుడువి. గొప్ప పని చేశానని పొంగిపోతున్నావేమో. దౌర్భాగ్యుడా, అక్క పిచ్చిది, అమాయకురాలు కాబట్టి నీకు అంత గౌరవం యిచ్చింది. నేనయితేనా...."

"ఊ! నువ్వయితే ఏం చేసేదానివో!"

"నా ఎడంకాలి చెప్పుతో నిన్ను సత్కరించేదాన్ని. అసలు అందుకుకూడా నీ కర్హతలేదు. సర్లే! ఇంకెందుకు మాటలుగాని... నీలాంటి గొంగళి పురుగుతో మాట్లాడాలంటే అసహ్యం కూడాను.

అక్కను నువ్వు పెళ్ళిచేసుకోనందుకు సంతోషిస్తున్నాను."

"ఓహో!"

"ఏం ఎలాగూ జరగదు కనక అంటున్నానని నీ వుద్దేశ్యమా. అదేంకాదు. నీలాంటి ధైర్యంలేని మగాడు....మగాడనిపించుకోడు. ఆడపిల్లలతో ఆటలాడుకోవడమే గొప్పతన మనుకుంటున్నావేమో! చేతనయితే మనసుకు నచ్చిన పిల్లని అందరినీ ఎదిరించి పెళ్ళాడడమే మగతనం. నీలాంటి పిరికిపంద, లేకిమనిషి మా అక్కకి తప్పిపోవ డమే అదృష్టం."

* * *

"అటువంటి మొరిగే కుక్కని ఎలా ఇష్టపడ్డావక్కా నువ్వు?"

జవాబుగా కుమిలి యేడ్చింది సరస్వతి.

"ఏడుపుకూడా ఎందుకు? అయినా అంత తెలివి తక్కువగా వాడి మాయలో ఎలా పడ్డావు? ఆశ్చర్యంగా వుంది."

"నీ కలాంటి పరిస్థితులు యెదురయితేగాని తెలియదులేవే! ఇలా మోసం చేస్తాడని అనుమానంకూడా రాలేదు."

"నాకు....అలాంటి పరిస్థితి రావడమా! అక్కా, అది చచ్చినా రాదు. ఈ ప్రేమలు, గీమలు అంటే పరమబోర్! ఔనుగాని, ఇంక ఏం పనిలేదా అక్కా మన ఆడవాళ్ళకి పెళ్ళి, ప్రేమ అంటూ.... ఎప్పుడూ అదే ధ్యాస! ప్రపంచంలో బోలెడన్ని విషయాలు తెలుసుకోవలసినవీ, నేర్చుకోవలసినవీను. సైన్స్, లిటరేచర్ యెంత వృద్ధి పొందాయో. ఎన్నెన్ని క్రొత్త విషయాలో....అబ్బ! ఒకొక్క పుస్తకం చదువుతుంటే....మనం ఎలాంటి స్థితిలోవున్నామో ఎంత, అజ్ఞానంలో వున్నామో తెలుస్తుంది. ఎందుకోమరి మన ఆంధ్ర దేశంలో ఆడవాళ్ళకి, ఈ పోచికోలు కబుర్లు అప్పడాలు వత్తుకోడాలూ తప్ప మరో పనిమీద ఆసక్తిలేదు" అంత విచారంలోనూ నవ్వింది సరస్వతి.

"ఆంధ్రదేశంలోనే అనకు. ఆడవాళ్ళంతా చాలా మట్టుకి అంతే."

"మిగిలిన వారి సంగతి మనకు తెలియదుగా. అందుకు అలా

అన్నాను గాని....మా క్లాసులో ఓ పంజాబీ అమ్మాయివుంది. మొన్న ఏమయిందో తెలుసా! తను కాలేజినుండి ఇంటికి వెళ్తుంటే, ఎవరూ లేనిచోటు చూసి ఓ అబ్బాయి చెయ్యి పట్టుకున్నాడు. నేను దూరంగా వస్తూవున్నాను. ఆ అమ్మాయి పెళీమని ఓ లెంపకాయ యిచ్చింది వాడికి. అంతే వాడు తేరుకొని చూచేసరికీ ఆ అమ్మాయి, ఓ ఫర్లాంగు దూరం వెళ్ళిపోయింది."

"కాని తర్వాత...."

"తర్వాత సంగతి అలావుంచు కానీ అక్కా, అదే మనవూరి తెలుగుపిల్ల ఏం చేస్తుందంటావు. 'జేర్' మంటుంది. వాడేదయినా చేస్తే కిక్కురుమనకుండా భరించి, కుండలకొద్దీ కన్నీళ్ళు కారుస్తుంది. ఎంత చదువుకుంటున్నా, యెంత తెలివైనదయినా ఇలాంటి విషయాల్లో మరీ బలహీనురాలిగా వుంటుంది. మా క్లాసు పిల్లలున్నారు చూడు కొంతమంది, వెనకాల అబ్బాయిలు కామెంట్ చేస్తూ వస్తూవుంటారు. వీళ్ళు మెలికలు తిరిగిపోవడం, సిగ్గుపడ్డం, లేకపోతే ఏడవడం. ఇంతేకాని 'నోర్మూయ్యరా కుంకా' అని చెప్పలేరు."

"ఏం లాభమే. ఎదురు తిరిగినా ఆడవాళ్ళకేకదా నష్టం."

"ఇదిగో....యిదే....అన్ని అనర్థాలకీ మూలం. ఆడదానికి ఆడదే శత్రువు. ఒకవేళ ఏ ఆడపిల్లేనా భంగపడితే సానుభూతి చూపకుండా రాళ్లు విసిరేది మొదట మనమే. అందుకే యిలా ఏడుస్తోంది మన స్థితి."

సరస్వతి ముఖంలో భయం తొంగి చూపింది. ఏదో అడగాలని చూసింది కాత్యాయని. కాని .... తటపటాయించి తిరిగి పోయింది.

* * *

"మామయ్యగారూ! శరత్ పుస్తకాలింకా ఏమైనా వున్నాయా?"

"ఇంకేం లేవు. అన్నీ చదివినట్లే" నవ్వుతూ అని, తిరిగ్గా కుర్చీలో కూర్చుంటూ "ఇంతకీ నీకు నచ్చినది ఏది?" అని అడిగాడు.

"అన్నీ ఒక్కో విషయంలో చాలా గొప్పగా అనిపిస్తాయి.

'శేషప్రశ్న'లోని కమల నాకు నచ్చింది బాగా." ఆలోచనగా అంది.

"అనుకున్నాను" అని చిన్నగా నవ్వుకున్నాడు.

"ఏయ్! సుశీలా! పోతావేం, కూర్చో!" లోపలికి వెళ్ళబో తున్న సుశీలని ఆపింది కాత్యాయని.

"నాకు బోర్ బాబూ? మీ శరత్ రచనలూ మీరూనూ. నువ్వు నాన్న కూచుంటే ఇవే చర్చలు. నువ్వు మాట్లాడుతూ వుండు. నేను లోపలికెళ్ళి అమ్మకి వంటలో సాయంచేసి వస్తాను."

"మామయ్యా! పైకి అంటే ఏమైనా అనుకుంటారని వూరు కున్నాగాని....కమల అన్నట్లు తాజ్‌మహల్ విషయంలో నాకూ అదే సందేహం."

"ఏది?"

"అదే, అంతమంది భార్యలు, ఉంపుడుగత్తెలు, జల్సాగా కులాసాగా కాలం గడిపే భోగపరుల గురించి....ప్రేమ అంటూ పెద్ద పదాలు వాడడం. పైగా ఇంకోటి చూశారా మామయ్యా, ఐశ్వర్యం వున్న పెద్దమనిషయితే, అతనిది భోగలాలసత, శృంగారం. అదే సామాన్యుడయితే వ్యభిచారం."

"లోకం తీరే అంత. ఇంతకీ నీకు 'శ్రీకాంత్' రాజ్యలక్ష్మి నచ్చలేదా?"

"ఎక్కడో చదివాను ఓచోట. చలంగారు అన్నారు. రాజ్య లక్ష్మిని మడిగుడ్డల రాజ్యలక్ష్మిగా మార్చేయడం బాగులేదని. పూజలు, వ్రతాలు ఈ పిచ్చిలో పడిన రాజ్యలక్ష్మిని చూస్తే నిజంగా జాలి వేస్తుంది. స్త్రీలోని బలహీనతనికూడా చూపెట్టాడిందులో. అటు వంటి స్త్రీలు వుంటారా? అనిపిస్తుంది. అలాగే సావిత్రి. 'ప్రేమ' అనే పదం వాడాలంటే నిజానికి శరత్ స్త్రీ పాత్రలకే చెల్లుతుందని పిస్తుంది. కాని మామయ్యా, ఈ ప్రేమ తీవ్రతకాదు గాని. మీ మగా ళ్ళని పట్టి బడుద్ధాయిలుగానూ, పొగరుమోతులుగానూ కూడా తయారు చేస్తుంది."

"అదేం?"

"కాదా మరి! ఎన్ని తప్పులు చేసినా మగాడ్ని క్షమిస్తుంది

ఆడది. అదే అతనిని రెండువిధాలా చెడుపుతుంది." చటుక్కున కేశవరావు మెదిలాడు కాత్యాయని దృష్టికి.

"ప్రేమని అర్హత అనేది చూడకుండా...."

"ప్రేమ అంటేనే గుడ్డిది అంటారు. అర్హతలు, అనర్హతలు విచారించి చూసేది మరో లౌకిక దృష్టి. దానికీ ప్రేమకీ పొత్తేలేదు." ప్రకాశరావు ఆమె మాటను మధ్యలోనే ఖండించాడు.

"అలా అయితే 'ప్రేమే దైవం' అంటారే! అది నిజమయి వుండాలి."

"నిజమే!"

"ఈ కాలంలో, ఆ శరత్ స్త్రీ పాత్రల్లో తప్ప, ప్రేమ అనేది లేనేలేదని చెప్పాలి."

"ఎందుకనో?"

"ఎందుకేమిటి? ఏ....మా అక్కలాంటిదో ఎవర్నో కోన్ కిస్కా గాడ్ని ప్రేమించా నంటుంది. 'వాడి సుఖ సంతోషాలే నాకు కావాలి. వాడు మంచి కట్నం తీసుకుని పెళ్ళిచేసుకోనీ, ఇంకో అమ్మాయితో బాగా కులకనీ' అని సంతోషంగా త్యాగం చేస్తుందా తన జీవితాన్ని? వాడు తనకి కావాలి. తనని పెళ్ళి చేసుకోవాలి. లేక పోతే భరించలేదు. చావడానికయినా సిద్ధపడుతుంది కాని వాడు మరొ కత్తిని చేసుకుంటె 'నీ సుఖమే నే కోరుకున్నా' అని పాడగలదా?"

ఆశ్చర్యంగా చూశాడు ప్రకాశం.

"స్వార్థంతో కూడినది ప్రేమెలా అవుతుంది మరి?"

"ప్రేమలో రెండు రకాలు."

ఫకాలున నవ్వింది కాత్యాయని. " 'నాకు కావాలి, నాదికావాలి, నా సమక్షంలో వుండాలి, ఇద్దరూ ఒకటవ్వాలి' యిలాటి ప్రేమకి మరో పేరేదయినా పెడుదూ మామయ్యా! మహా బోర్ కొడుతోంది వినలేక."

"ఇవాళేమిటో నువ్వు కోపంగా వున్నట్లున్నావు?"

"అబ్బే!" అంటూ వూరుకుండి పోయింది.

రోజూ ఆమెలోవుండే వుత్సాహం కనిపించక, లాలనగా

అడిగాడు ప్రకాశం.

"ఏమ్మా! ఏం జరిగింది? ఇంట్లో ఏదయినా...."

కాత్యాయని ముఖం మ్లానమైంది. చిన్నగా నిట్టూర్చి అంది. "మనసుని అదుపులో పెట్టడం గురించి మనవాళ్ళు ఎన్నో రకాలుగా చెప్పారు. కాని ఎవ్వరూ అందుకు ప్రయత్నించరు సరికదా లేనిపోని సమస్యలు కొని తెచ్చుకోటం."

"మనసుని అదుపులో పెట్టుకోవడం అనేది మహా మహా వాళ్ళకే సాధ్యంకాదు. అన్నంత సులభం కాదు అది. ఇంతకీ ఎవర్ని అంత విమర్శించేస్తున్నావు?"

ఓసారి లోపలికి తొంగిచూపి నెమ్మదిగా చెప్పింది సరస్వతి గురించి. "మీ దగ్గరవున్న చనువువల్ల ఈమాట నేను చెప్పగలిగాను. అత్తయ్య దగ్గరకూడా నాకింత...." అర్ధోక్తిలో ఆగింది.

"నిజమే! నాకు తెలుసు" అని నిట్టూర్చి. "ఏమిటోనమ్మా, ఈ మధ్యతరగతి జీవితాల్లో ఆడపిల్లల బ్రతుకులు? నువ్వు సరస్వతి కేమని చెప్పావు? పాపం.....అమాయకురాలు."

"మరచిపొమ్మని చెప్పాను. మీదాకా వచ్చివుంటుంది మొన్నటి సంగతి?"

"ఏది? అ....నూతిలో" అంటూ ఆగాడు మాట పూర్తి చేయడానికి మొహమాట పడి.

"తటపటాయింపు ఎందుకు మామయ్యా! నా దగ్గరా? నేను యేమీ అనుకోను. చుట్టుపక్కల అమ్మలక్కల గుసగుసలు ఇప్పుడు తగ్గాయి."

"ఎందుకనీ?"

"ఆ రాత్రి అదివెళ్ళి నూతిలో పడిందా? వెంటనే నాన్న, అన్నయ్య అంతాలేచారు. అన్నయ్యకి ఈతవచ్చు. బొక్కెన్లవీ నూతిలోపడితే వాడే తీస్తుంటాడు. ఆ విద్య ఇప్పుడు పనికొచ్చింది. మొత్తానికి పైకి లాగారు ఇరుగు పొరుగు సహాయంతో. ఇక చూడండి గుసగుసలు. 'ఏదో తప్పుచేసింది. నూతిలో పడింది. కాలు జారిందని అబద్ధాలు చెబుతున్నారు' అన్నారు."

"ఔను, మేం అలాగే విన్నాం. సుశీల ఆరోజు చెప్తే 'గండం గడిచిందిరా' అని సంతోషించాం."

"అమ్మ అందరితోనూ అలాగే చెప్పింది. అంతదాక యెందుకు? తనే అలా అనుకుంది. తరవాత వంటరిగా చూసి నేను చివాట్లు పెట్టాను."

చివరి వాక్యాయానికి నవ్వొచ్చింది ప్రకాశానికి. తనూ నవ్వేసి చెప్పడం మొదలెట్టింది. "అది బయటచేరి నెల దాటిపోయిందట. ఏదో అయిపోయిందని భయపడి అలా చేసానంది."

"ఆ!" ఆశ్చర్యంతో నోట మాట రాలేదు.

"ఆ నూతిలో పడిన మర్నాడే అది మూడు రోజులు క్యాజువల్ లీవు తీసుకుంది. దాంతో అమ్మ చెప్పిన మాట నిజమే అని కొంత నమ్మకం ఏర్పడింది మా వాడలోని అమ్మలక్కలకి."

"ప్చ్!"

"ఏమిటో మామయ్యా! తల్చుకుంటూ వుంటే....తీరికూర్చుని మనమే సమస్యలని సృష్టించుకుంటామేమో అనిపిస్తోంది."

"కొంత అదీ వుంది. కొన్ని అనుకోనివి, మన చేతుల్లో లేనివి వచ్చి పడుతుంటాయి."

"అన్నిటికీ కోరికలే కారణం. కోరికలెంత తక్కువైతే అంత సుఖం మనిషికి."

"ఏమిటి భగవద్గీతా, బుద్ధిజమా....ఏమిటి బోధిస్తున్నావు మీ మామయ్యగారికి" పార్వతి, చేతిలో ఉప్మా ప్లేటుతో వచ్చింది.

"అన్నీ యెగిరిపోయాయి ఆ వుప్మా చూడగానే. ఇలా ఇయ్యండి అత్తయ్యా....ముందు."

* * *

"నాన్నా!"

"ఏమ్మా!"

"నా విషయం ఏం చేశారు?"

"నీకు తెలియనిదేముంది. నువ్వే చెప్పు పోనీ నన్ను ఏం చేయమంటావో!

"అడగడం అనవసరం" లోలోపలే గొణుక్కుంది.

జ్వరంతో మంచంమీద పడుకుని వుంది సుభద్రమ్మ.

పక్కనే కుర్చీలో కూర్చుని దిగులుగా ఆలోచిస్తున్నాడు వెంకట్రావు. కాత్యాయని తల్లి మంచంమీద కాళ్ళదిక్కుగా కూర్చుని వుంది. ఆమె ముఖంలో తీవ్రమైన ఆవేదన.

"ఇదిగో అమ్మా! బార్లీ తాగు" సర్వతి గ్లాసు పట్టుకుని వచ్చింది.

"ఏమండీ" నీరసంగా పిల్చింది సుభద్రమ్మ.

"ఏం?"

"సరసుకి ఏదో సంబంధం చూసి ముడి పెట్టేయండీ."

"అబ్బబ్బ! సరసుకి సంబంధం కాత్యాయనికి చదువు రామం గాడి చదువు. రంగడి చేతి ఖర్చులు. ఈ గుంటగాళ్ళిద్దరికీ స్కూలు ఫీజులు. ఎక్కడ్నుంచి తేను డబ్బు చెప్పు. ఎక్కడేనా కన్నం వేయాలి."

"పోనీ ఆ సుందరమ్మగారు చెప్పిన సంబంధం చూడండీ."

ఉలిక్కిపడ్డారు కాత్యాయనీ సరస్వతీను.

ఆ సంబంధం పెళ్ళి కొడుక్కి ఇంచుమించు తమ తండ్రి వయసు వుంటుంది. ముగ్గురు పిల్లలు. భార్యపోతే ప్రస్తుతం పెళ్ళి కూతుళ్ళ వేటలో వున్నాడు.

వెంకట్రావు ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు. ఆ తరువాత చెప్పులు వేసుకుని బయటికి నడిచాడు.

* * *

"ఫస్ట్ క్లాసులో పాసయ్యింది పాపం. పైకి చదివేందుకు తాహతులేదు." విచారంగా అన్నాడు ప్రకాశం కాత్యాయని గురించి.

సుశీలకి చిన్ననాటినుండి కాత్యాయని మీద అభిమానం హెచ్చు, "నాన్నా" తటాపటాయిచింది, ఏదో చెప్పబోయి.

"ఏమిటి?"

"మనం దాని చదువుకోసం ఎందుకు హెల్ప్ చేయకూడదూ!"

"బాగుంది వరస? మనమేం కొండలు రాసి పోసి వున్నాయా? దానధర్మాలకి హద్దంటూ వుంది." పార్వతి విసుగ్గా అంది.

"నువ్విలా అంటావని తెల్సు పార్వతీ. అందుకే యిన్నాళ్ళు వూరుకున్నాను. ప్రస్తుతం ఏదైనా చెయ్యగలిగితే...."

"మీరేమైనా చెప్పండి. ఆ అమ్మాయిని ఎంతగానైనా అభిమానించండి ఒప్పుకుంటాను. కాని, మన సుశీలకే లేనిది....దానికిపోయి మీరు ఎమ్. బి. బి. ఎస్. చెప్పిస్తానంటే నేనూరుకోను. ఏమైనా సరే!"

* * *

"కాత్యా! కాస్తంత కాఫీ, టిఫినూ తయారు చేసిపెట్టవే," సుభద్రమ్మ ప్రాధేయపడింది.

"కాఫీ చాలు. టిఫిన్ దండగ కూడా యెందుకు? అసలా ముసిలాడికి పెళ్ళి చూపులు కూడా ఎందుకుట? వాడికి పిల్లనివ్వటమే గొప్ప సంగతి" అక్కసుగా అంది.

"ఊరుకోవే తల్లే! ఇంతకంటే ఏం చేయగలం చెప్పు? అక్కవింటే బాధపడుతుంది."

"అరెరే" నాలుక్కర్చుకుంది కాత్యాయని.

ఏ భావమూలేక శూన్యమైన చూపులతో నిరుత్సాహంగా తిరుగుతున్న సరస్వతిని చూస్తే జాలేస్తోంది.

రంగు వెలిసిన పటంలా, మబ్బుపట్టిన ఆకాశంలా వెల వెలబోతూ ఓ సారి, దిగులుగా బరువుగా ఓ సారి కనిపిస్తోంది.

"అక్కా! పెళ్లి చేసుకు తీరాలని వుందా? ఈ పెళ్లి లేకపోతే ఏం? ప్రయివేట్‌గానైనా ఇంటర్ చదివావు. ఎలాగోలా కష్టపడి బి. యేకి కట్టొచ్చు. టైపూ పాసయ్యావు. ఏదో ఒక చిన్న ఉద్యోగం చూసుకుంటే....మన తిండి గడిచిపోతుంది. ఎందుకీ పెళ్ళికి వప్పుకున్నావు?" చివరి ప్రయత్నంగా మళ్ళీ కదిపింది కాత్యాయని.

"ఎన్నిసార్లు చెపుతావే పిచ్చీ! కేవలం పొట్ట గడవడమే జీవితానికి పరమార్ధమనుకున్నావు కాబోసు. ఎన్నాళ్ళని ఇలా వుండగలం? అమ్మ, నాన్నకీ కళ్ళెదురుగా భూతాల్లా భయపెడుతూను.

యెవడ్నో ఒకడ్ని కట్టుకోవాలి యెప్పటికైనాను. ఇంతకంటె మంచి వాడు, బాలకుమారుడు మనలాంటి కుబేర పుత్రికలని వరించి రాడు."

శూలంలా గ్రుచ్చుకుంది కాత్యాయనికి చివరి మాట.

"ఇది నిజం. ముమ్మాటికీ నిజం. చదువు, అందం అన్నీ వున్నా.... కేవలం డబ్బు....డబ్బు....వల్ల తమకి తగిన జోడు దొరకదు."

"అయితే మాత్రం ఆ ముగ్గురి పిల్లల తండ్రితో సరిపెట్టుకోవడం....యెలా....సహించగలవే?"

"పరిస్థితులే నేర్పుతాయి."

సరస్వతి నిర్లిప్తంగా సమాధానమిచ్చింది. అక్క యెంతో యెదిగిపోయినట్లు అనిపించింది. ఈ సమస్యకి పరిష్కారం తన చేతిలో వుంటే యెంత బాగుండును?

* * *

నిరాడంబరంగా సరస్వతి పెళ్ళి జరిపించాడు వెంకట్రావు.

'ఖడ్గమృగంలా వున్నాడు' అనుకుంది కాత్యాయని.

అతనిమీద కోపంతో తప్పుకు తిరిగింది.

"మీ చెల్లాయికి నామీద కోపమా ఏమిటి!" నవ్వుతూ సరస్వతి భర్త అడిగాడు ఓనాడు.

"అదేం! అలా....అలా....అలా ఎందుకనుకుంటున్నారు?"

"నన్ను చూస్తేనే ముఖం చిటపటలాడిస్తుందిలే అందుకు."

"అబ్బే! అదేం లేదండీ. దాని స్వభావమే అంత. మీ మీద దానికెందుకు కోపం."

"ఏమోలే! ముగ్గురు పిల్లల తండ్రిని....చిలకలాంటి తన అక్కని చేసుకున్నానని కోపమేమోనని." నవ్వుతూ ఆమెను మీదకు లాక్కున్నాడు.

పొంగివచ్చే కన్నీళ్ళని ఆపుకుంటూ, అతనికి తెలియకూడదని అతని గుండెలమీద ముఖం అదిమింది.

"అబ్బో తనమీద యిష్టమే సరస్వతికి" అనుకుంటూ పొంగి

పోయాడు.

*　　*　　*

పాదులు సరిచేస్తూ-కలుపుమొక్కలు తీసేస్తూ, నీళ్లు తోడి పోస్తూ, రోజంతా పెరట్లోనే గడుపుతోంది కాత్యాయని. వున్న కాస్త జాగాలోనే అందంగా మొక్కలువేసి పెంచుతోంది. ఆనపకాయలు నవనవలాడుతూ నాలుగు కాసాయి. పొద్దెక్కి లేచివచ్చి వాటినలాగే చూస్తూ నుంచుంది. "వెళ్లిరండమ్మా" అంటూ నాలుగు కోసి, తమ్ముడి చేతికిస్తూ "ఒరే! ఆ చివరవున్న కూరలకొట్లో ఇవి ఇచ్చేసి వాడు రెండు రూపాయలు యిస్తాడు తీసుకురా!" అంది.

"ఏమిటే అదీ! యెక్కడికి పంపుతున్నావు?" సుభద్రమ్మ ప్రశ్న.

"కొట్టుకి."

"అమ్ముతున్నావా?"

"ఔను. ఒరే....బాబీ—అలాగే ఆ కామయ్య యింట్లో పొట్లకాయలు కావాలేమో అడిగిరా. కాయ నలభై పైసలని చెప్పు."

"ఏవిటే ఆ అమ్మకాలు. ఎవరేనా నవ్వుతారు కూడాను. ఛ! పాడు. కూరలమ్ముకోవటం ఏవిటే?"

"మరేం తప్పుపని కాదులే!" నిర్లక్ష్యంగా విన్పించింది సుభద్రమ్మకి కూతురి సమాధానం.

"ఇంటా వంటా లేని పన్లు. రేపొద్దున్న కూరలమ్ముకుంటుందంటారు నలుగురూను." రుసరుసలాడింది.

చటుక్కున గుర్తువచ్చింది అంతలోనే, "అవునూ! ఆ ప్లాస్టిక్ వయర్ ఎందుకే తెచ్చిపెట్టావు. దాంతో బేగ్‌లల్లి అవి కూడా...."

"ఆ! అవికూడా అమ్ముతాను. నీకు ఓపిక లేదుగాని, నువ్వు అప్పడాలు వత్తితే అవీ అమ్ముతాను." నవ్వింది కాత్యాయని.

"ఏమంత వచ్చేస్తుందే నీకు అదాయం. పరువు తక్కువ పన్లు కాకపోతే...."

"పరువు యెక్కువ వున్న పన్లు యివి. ఆదాయమంటావా: ఎంతవస్తే అంతే. తమ్ముడి స్కూలు ఫీజుకయినా పనికొస్తుంది.

కనీసం వాడినైనా చదివించగలిగితే...." కాత్యాయని పట్టుదల తెలిసిన సుభద్రమ్మ మరి మాట్లాడలేదు. తన కూతురు ఇంటర్ ఫస్టున పాసయింది. అంతా అనడమే మంచి తెలివైన పిల్ల అని. దానికీ పాపం డాక్టరవాలని కోరిక. తమ పరిస్థితులు చూస్తే, ఆ కోరికని పైకి చెప్పడమే నవ్వుతాలుగా వుంటుంది. అందుకే పాపం అన్నీ అర్థం చేసుకునే నోరెత్తలేకపోతోంది. కూతురి మీద జాలితో నిండిపోయింది ఆమె మనసు.

* * *

పిచ్చివాడిలా తిరిగాడు రంగారావు. ఎవరేనా కరుణించి తనకో చిన్న జాబ్ యిప్పిస్తే బాగుండును. ఆశగా చూశాడు అందరి వేపు. ఆశని పెంచి ఆ తరవాత కూల్చేసిన వారూ, అడగడానికి నీకు అర్హతే లేదని పెదవి తెరిచి చెప్పిన వాళ్ళూ, "నీకా...జాబా.." అంటూ నోటితో నవ్వి, నొసలితో వెక్కిరించిన వారూ....అంతా ఈ బాపతే కనిపించారు. నిరాశ పొగలా కమ్మి ఉక్కిరిబిక్కిరి చేసింది. ప్రపంచం అంతా నిర్దయగా కఠినంగా రాక్షసుల కూడలిలా కనిపించింది.

"ఏం అన్నయ్యా! ఏమన్నాడు దామోదరం!"

"ఓ అమ్మాయిని అప్పాయింట్ చేసేశాడు."

"అయ్యో! అలా అన్ని కబుర్లు చెప్పాడు."

"వాడికి వన్నెల విసనకర్రల్లాంటి ఆడపిల్లలు కావాలి. సరదాకి జాబ్ చేస్తోందిట ఇంతకీను ఆ పిల్ల! పెద్ద అవసరమున్నట్టు ఆ అమ్మాయికి ఇచ్చేడు."

"అవసరాన్నీ అర్హతని బట్టి వుద్యోగాలు వస్తే యికనేం! మా క్లాసులో మరకతాన్ని చూడు. అత్తెసరు మార్కులతో పాసయింది ఇంటర్. ఎన్‌ట్రెన్స్‌లో ఏం గోలుమాలుందో తెలియదు. క్లాసులో యెప్పుడూ లాస్టుండేది....ఇవాళ యెమ్. బి. చదువుతోంది."

"ఏవిటీ! ఆ....మరకతం....ఆ....మొద్దుపిల్ల...."

"ఆ! అదే! ఆ మొద్దుపిల్లే రేపు మన వీధిలో "డాక్టరు మర

కతం" యెమ్. బి. బి. ఎస్. డి. జి. టి. అని బోర్డు తగిలిస్తుంది."

"హరిజనులమేనా కాకపోయేమే మనం!"

నవ్వేసింది కాత్యాయని "ఒకప్పుడు వాళ్ళు యిలాగే అను కుని వుంటారు....అగ్రకులాల గురించి."

"నిజమే కావచ్చు. అయితే మాత్రం అర్హతానర్హతలు చూడ కుండా, రెస్పాన్సిబుల్ జాబ్స్‌లో జాతిని బట్టి...."

"కులాన్నిబట్టి."

"ఆ! అదే....కులాల్నిబట్టి అవకాశాలు....స్పెషల్‌గా సీట్స్ కేటాయించడం....ఛ! యిదెంత అపకతవకగా వుంటుందో ఆలో చించరా?"

"ఆలోచించరు. ఆలోచించాలని ఎవరూ అనుకోరు. ఎవడి స్వార్థం వాడిది."

కాసేపు మౌనంగా ఉండిపోయాడు రంగారావు.

"ఏదైనా చిన్న బిజినెస్ లాంటిది పెట్టుకుందామన్నా పెట్టు బడికి డబ్బు లేదు. దోచుకురావాలి యెక్కడ్నుంచేనాను."

"బాంక్‌లు అప్పులివ్వవూ?"

"అవా? అవి బాగా వున్నవాడికే యిస్తాయి."

"అన్నయ్యా ఇన్నాళ్ళు ప్రకాశం మామయ్యగారిని ఏమీ అడగలేదు నేను. ఈవేళ నీకోసం ఆయన్ని సహాయం అడగాలను కుంటున్నాను."

"ఏదో ఒకటి చూడవే. చిన్నదానివైనా, నీకు తోచిన పన్లు నువ్వు చేస్తున్నావు. అవునూ, ఆ బాగ్‌లో లాభమెంత వచ్చిందీ?"

"అది వ్యాపార రహస్యం. అడగ కూడదు."

* * *

"మనుచరిత్ర చదువుతుంటే....వరూథినిని దాటాక తరవాత అధ్యాయాలు బోరనిపించాయి మామయ్యా." పుస్తకం తిరిగి యిచ్చేస్తూ అంది కాత్యాయని.

"అది అంతే. పారిజాతాపరహణంలో సత్యభామ అలకతో తీరిపోతుంది కొందరి ఆసక్తి."

"కాని మామయ్యా! వాటిల్లో కొన్ని కొన్ని భావాలు ఎంత గొప్పగా వుంటాయి. అందులోనూ ఎంతో కవిత్వం వుందని పిస్తుంది. ఎందుకనో అలా నిర్లక్ష్యం చేస్తారు మనవాళ్లు."

"ఛందస్సు వంటికి సరిపడక."

"కొంతవరకు నిజమే అనుకో. నాయికల విరహం, వెన్నెల నించీ, మన్మధుని వరకూ తిట్టిపొయ్యడం యివన్నీ విసుగ్గానే అనిపిస్తాయి. కాని పాత్రచిత్రణ విషయంలో ఎంత మెలకువ వారికి అనిపిస్తుంది కొన్ని చదువుతుంటే."

"కాని కొంతమంది విషయంలో దానికంత ప్రాముఖ్యం ఉన్నట్లు కన్పించదు. కేవలం వాళ్ళ పాండిత్యం, ప్రతిభ చూపించు కోడానికే అన్నట్లుంటాయి."

"మీరు చెప్పిన మాటలు వింటుంటే, నాకు 'గిరిక' గుర్తు వస్తోంది మామయ్యా! ఆ మధ్య రేడియోలో ఓ ప్రసంగం వచ్చింది. ప్రబంధ కన్యల గురించి వరసగా. 'గిరిక' మహా విదుషీమణియట. చమత్కారంగా మాట్లాడడంలో మంచి నేర్పరిట, సరస వచనా రచనా ధురీణట. ఎక్కువగా ఆమె తెలివితేటల్ని ప్రశంసిస్తూ మాట్లాడింది ఆవిడ. నాకు నిజంగా నవ్వొచ్చిందనుకో. ఏదో ప్రసంగం చేయాలి కదాని, నాలుగు సుదీర్ఘ సమాసాలు వేసి, సకల సద్గుణ రాసి యని, సకల కళా ప్రపూర్ణ అని పొగిడేస్తే చాలా! ఒక్కొక్క పద్యానికి పదేసి అర్థాలు వచ్చేటట్టు రాస్తే, ఆ పాండితీ ప్రకర్షకి సంతోషించి వూరుకోవాలిగాని ఆ పాత్రలని పైకెత్తేయడం ఎందుకు? నన్నడిగితే గిరిక ఓ మొద్దమ్మాయిలా కన్పిస్తుంది నాకు."

నవ్వేశాడు ప్రకాశం. "అదేం!"

"అవును మామయ్యా వరూధిని, సత్యభామ, దమయంతి వీళ్ళంతా ఒక్కొక్కరిది ఒక్కొక్క ప్రత్యేకత. ప్రతీ పాత్ర మనల్ని ఆకట్టుకుంటుంది వాళ్ళ వాళ్ళ వ్యక్తిత్వ, స్వభావాల వల్ల. గిరికలో ఎటువంటి ప్రాధాన్యత కనిపించదు. ఓ బొమ్మలా కనిపిస్తుంది."

"బాగానే వుంది. నువ్వన్నది నిజమే. నీ భావాలన్నీ ఎప్పటి

కప్పుడు రాసేస్తూ వుండకూడదూ!"

"అయ్యయ్యో! అంత ద్రోహం నే చేయతల్చుకోలేదు మామయ్యా! ఇప్పటికే సాహిత్యం మా రయిత్రుల చేతుల్లో పడి మాంచి పాకాన పడింది. వంటింట్లోంచి వచ్చే తాళింపు ఘుమఘుమలు పడకగది సరసాలు, డ్రాయింగ్‌రూమ్ వూహాలోకాలూ, అన్నీ వంట బట్టాయి. అప్పుడప్పుడూ డాబా ఎక్కి పైచూపులు చూస్తూ స్వర్గాల్లో విహరిస్తుంది. నేను కూడా ఎందుకు దాన్ని లాక్కెళ్ళి మా యిరుకు కొంపలో బంధించడం."

"బాగానే వుంది నీ విమర్శ."

"ఏమిటి మామయ్యగారూ....ఈవేళ అలా ముభావంగా వున్నారు?"

"ముభావమా! నీతోనా?"

"ఆ! రోజూ వచ్చి, మీ పుస్తకాల బీరువానంతా దోచుకుంటు న్నానని కోపం కాదు కదా నామీద."

"ఇంకా నయంలే. ఇన్ని పుస్తకాలు కొని వుంచాను. ఏనాడూ సుశీల చదవదు. దానికి ఇంటరెస్టు లేదు. నువ్విలా చదవడం దాన్ని గురించి తర్కించడం నాకెంతో సంతోషంగా వుంటుంది. నిన్నింత చిన్న పిల్లగా ఎరుగుదును. నా కళ్ళముందు పెరిగావు. నీ భవిష్యత్తు యెలా వుంటుందో అన్న ఆలోచన వచ్చినప్పుడల్లా నాకు కొంత విచారంగా వుంటుందమ్మా! నిన్ను చదివించే అదృష్టం నాకు లేదు. నీ తెలివీ, వుత్సాహం అన్నీ అలా వ్యర్థం అవు తున్నాయే అనే బాధగా వుంటుంది."

"దానికేముంది మామయ్యగారూ! అందరికీ అన్నీ అమరితే సుఖానికి విలువ వుండదు. నేను ఇంగ్లీషు లిటరేచర్‌తో బి. యెకి కడతామనుకుంటున్నా. అప్పుడప్పుడు నాకు మీరు ప్రయివేటు మాష్టా రుగా అవతారమెత్తాలి."

"సంతోషంగా తల్లీ. అంతకంటే కావాల్సిందేముంది. ఆర్. కె. నారాయణన్ బుక్స్ చదివావా? ఆ పై రేక్‌లో వున్నాయి. కావా లంటే తీసుకో."

"సరే! మామయ్యగారూ, మిమ్మల్ని మరో సహాయమడుగు దామనుకుంటున్నాను."

"ఈ మాటలు నేను వినడం ఇదే మొదటిసారి."

"నాకు మీ స్నేహాన్ని, ఆప్యాయతని పోగొట్టుకోడం ఇష్టం లేదు. అందుకే ఈమాట అడగలేదు యిన్నాళ్ళూను...."

"ఇప్పుడు?" నవ్వుతూ అడిగాడు.

"ఇప్పుడూ ఇష్టంలేదు. కాని తప్పటంలేదు. అన్నయ్యని చూస్తే, నిరాశ ఎక్కువై వాడికి పిచ్చిపడుతుందేమోనని భయం వేస్తోంది. అందుకే....యింక 'అన్యధా శరణం నాస్తి' అని మీ శరణు జొచ్చాను."

"అంతమాట ఎందుకు తల్లీ. మీ పరిస్థితులు నాకు తెలియనివి కావు. రంగారావు ఎన్ని ప్రయత్నాలు చేస్తున్నాడో నాకు తెలుసు. మాదో ప్రయివేటు కంపెనీ. పేరుగొప్ప వూరుదిబ్బ అని అందుకే హోదాగల వుద్యోగమైనా, నా చేతిలో అధికారాలేం లేవు తల్లీ. ఇన్‌ఫ్లుయన్స్ అసలే లేదు. మీకు ఏ విధంగా సహాయం చేద్దామన్నా చేయలేని పరిస్థితిలో వున్నాను."

"దానికేం వుంది. ఊరికే చెప్పిచూస్తే మంచిదని చెప్పాను. మీరు చేయలేని పనికి, బాధ పడడం యెందుకు? మీ అభిమానమే చాలు మామయ్యా, నాకెంతో హాయిగా వుంటుంది. మనసుకెంతో బలంగా అనిపిస్తుంది."

"కాని, ప్రస్తుతం ఓ చిన్నపని చేయగలను. అయితే రంగా రావు దానికి ఒప్పుకుంటాడో....లేదో. ఏదయినా చిన్నబుచ్చు కుంటాడో అని."

"చెప్పండి, సందేహ మెందుకు?"

"మా ఆఫీసులో అటెండర్ పోస్టు ఒకటి ఖాళీగావుంది. దాని కసలు టెన్తుక్లాసు వాడు చాలనుకో. అయినా.."

"ఏ వుద్యోగమయినా సరే మామయ్యా! ప్రస్తుతం కళ్ళకద్దు కుని మరీ చేరుతాడు. అయినా యెక్కువ, తక్కువలు చూసుకోడం తెలివి తక్కువ."

"అది కొన్ని సందర్భాల్లోనే. ఎమ్. బి. బి. ఎస్. చదివిన వాడు కలెక్టరాఫీసులో గుమాస్తాగా చేరితే ఎలావుంటుంది? అలాగే ఏ సివిల్ ఇంజనీరింగో పాసయినవాడు ఆర్థిక పరిస్థితులవల్ల, యెలిమెంటరీ స్కూల్లో తెలుగుచెప్పడానికి చేరితే ఎలా వుంటుందంటావ్!"

"అప్పటి కది....మనదేశ ప్రగతికి, అద్దంపట్టే పరిస్థితి. ప్రస్తుతం అలా లేదని చెప్పగలరా?"

"ప్రస్తుతం అలావుందో లేదోగాని....ఆ దారిలో వుందని చెప్పొచ్చు. మా దూరబ్బంధు వొకడు ప్రస్తుతం ఆ పరిస్థితిలోనే వున్నాడు."

"ఎవరా బంధువు? ఏమా కథ?"

"మా తండ్రి, వాళ్ళతండ్రి అన్నదమ్ముల పిల్లలు. సుందరమ్మ అని నాకు వరసకు అక్క అవుతుంది. రాకపోకలు లేవు. దాని కొడుకే ఇప్పుడు ఖాళీగా వున్నాడు. అతను డాక్టరు. ప్రయివేటుగా ప్రాక్టీసు పెట్టుకునేందుకు తగిన స్తోమతులేదు. ఉద్యోగం లేదు. ఏదో వో చిన్నగదిలో కంపౌండర్, నర్స్, క్లీనర్ అన్నీ తానే అయి, చదివిన చదువును తన శక్తిమేరకు సార్థకం చేస్తున్నాడనుకో. ఆ మధ్య నే నటువేపు వెళితే, 'ఇంకా ఏది మామయ్యా, అణా కానీ డాక్టరునే నేను' అన్నాడు నవ్వుతూను."

"పాపం?"

"ఇంతకీ అతని అదృష్టం బాగుంది, సుడి తిరిగితే సుశీలని అతని కడగాలని మీ అత్తయ్య వూహ."

"అబ్బో! అయితే సుశీలకి వరుడు సిద్ధంగానే వున్నాడన్నమాట."

పార్వతి, సుశీలలు అప్పుడప్పుడు వీరి సంభాషణలో పాల్గొన్నా అట్టే ఆసక్తి చూపించరు. "మామయ్యని బోరించడమైంది. ఇక అత్తయ్య వంతు" అంటూ కాత్యాయని వంటింటివేపు నడుస్తుంది. ఆమెతో కాసేపు కబుర్లుచెప్పి, వెళుతుంది. కాలక్షేపానికి పత్రికలు చదవడం, కుట్లుకుట్టడం సుశీల హాబీ.

"ఏం సిద్ధమో! ఏమో! అతగాడికి ఆస్తిపాస్తులు లేవు.

ఉన్నదంతా వూడ్చి డాక్టరీ చెప్పించింది తల్లి. ఆ పల్లెటూళ్ళోనే మీ మామయ్య చెప్పినట్లు, అన్నీ తనే అయి ప్రాక్టీసు పెట్టాడు" పార్వతిలో కొంత అసంతృప్తి తోచింది.

"ఉంటే చక్కగా పల్లెటూళ్ళలో వుండాలి. లేకుంటే పెద్ద సిటీస్‌లో వుండాలి. అంతేకాని ఇలా అటూయిటూ కాని త్రిశంకు స్వర్గాల్లో వుండడం బోర్. ధరలు యెక్కువ, ఇళ్ళు అద్దెకు దొరకవు, పాలు నీళ్ళకి కరువు. ఇవన్నీ సిటీ లక్షణాల్లే అని మురిసి పోదామంటే, అక్కడ లాగా పక్కవాళ్ళ సంగతులు పట్టించుకోకుండా వుంటారా? అదీలేదు. 'ఆ కాత్యాయని అలా నడిచింది, ఇలా తప్పుకుంది. వాడితో మాటాడింది. వీడితో తిరిగింది.' ఇలాంటి భోగట్టాలు మాత్రం కావాలి!"

పార్వతి నవ్వింది. "నువు చెప్పింది నిజమే కాత్యా. అందుకేగా సుశీలని యెక్కడికీ పంపను నేను. కాలేజికి వెళ్ళడం, ఇంటికి రావడం. అంతే. ఎప్పుడేనా ఓ సినిమాకి."

"నే మాత్రం తిరుగుతుంటాను మీ యింటికి, మా యింటికీ మధ్య బొంగరం లాగా."

దీక్షగా కుట్టుపనిలో నిమగ్నమయిన సుశీల కల్పించుకుంది. "తిరగడం యిష్టమేకదా నీకు. ఏ జాబైనా చేస్తానంటావు. నాన్నగారి కంపెనీలో సేల్స్‌గర్ల్స్ కావాలిట. చేరకూడదూ?"

ఎగిరి గంతేసింది కాత్యాయని. "ఉండు, మావయ్యగారి నడుగుతాను."

"ఔనమ్మా! కాని అది కష్టమయిన పని అని నీకు చెప్పలేదు. కొత్తగా మేం ఒక బట్టలుతికే పౌడరూ, సోప్సూ అవీ ఇంట్రడ్యూస్ చేశాం. అవి తీసుకుని ఇంటింటికీ వెళ్ళి ప్రచారం చేయాలి. పొద్దున్నుంచి సాయంత్రంవరకు తిరగాలి. జాబ్ కూడా టెంపరరీదే. జీతం చూస్తే...."

"ఫరవాలేదు మామయ్యా! చేస్తాను. ప్లీజ్. అది నాకు ఇప్పించేట్టు చూడండి."

"నువ్వు ఎండలోపడి తిరగగలవా? అసలే సన్నగా తీగలా"

ఫక్కున నవ్వింది. "ఉక్కుతీగ అనండి సరిపోతుంది. తిరిగితే నాలాంటి వాళ్ళే తిరగాలి. తిరగటి రాళ్ళలా, రోడ్డురోలర్లులా వున్న వాళ్ళేం తిరుగుతారు!" అని నాలుక్కర్చుకుంది. 'సుశీలలావు.' భయం భయంగా చూసింది సుశీలవంక.

నవ్వేసింది సుశీల. "ఫరవాలేదు లేవే. నువ్వు అనక యెవరంటారు నన్ను. పైగా నీ నోటి విమర్శలయినా, తిట్లైనాకూడా కల్మషంలేని గంగలా వుంటాయి. కుళ్ళు, కుత్సితం లేని దానివి. అందుకే నువ్వెలా మాట్లాడినా నాకు కోపంరాదు."

చెమర్చిన కళ్ళను దాచుకుందికి ముఖం తిప్పుకొంది కాత్యాయని.

* * *

తల్లికి కావల్సినవన్నీ స్టవ్‌దగ్గర అమర్చింది. "రామం ఇవాళ నువ్వు తొందరగా స్నానం కానివ్వు" అని తొందర పెట్టింది. "చెల్లాయ్, రావే జడవేస్తాను" అంటూ చెల్లెల్ని స్కూలుకి రెడీ చేసింది.

"తమ్ముడూ, పక్కింటావిడతో, జాకెట్టు తరవాత కుట్టిస్తానని చెప్పిరా!" అంది.

"అదేమే, ఈవేళ మధ్యాహ్నం ఇచ్చేయకూడదూ!" సుభద్రమ్మ యధాలాపంగా అంది.

"అమ్మా!" జడ వేసుకుంటూ దగ్గరగావచ్చి నిలబడింది.

"ఏవిటి?"

"నేనీవాళనుంచి సోపులు, ఫినాయిలూ వగయిరా వస్తువులు కూడా అమ్ముతున్నాను."

"అదేవిటి? అవికూడా నువ్వే తయారు చేస్తావేంటి యింట్లో పొయ్యి పెట్టి?"

"కాదమ్మా ప్రకాశం మావయ్యగారి కంపెనీవాళ్లు...."అంటూ వివరం చెప్పింది. గబగబ కాస్త మజ్జిగ అన్నంతినేసి, హడావుడిగా వెళ్ళిపోయింది. దిగాలుగా చూస్తూ కూర్చుంది సుభద్రమ్మ.

"ఆడపిల్లలు. అడ్డమయిన వీధులూ తిరిగి, యెండనక,

వానవక....ఏం వుద్యోగాలో, బంగారు తీగలా వుంటుంది నా తల్లి. ఓ ఛాయ తక్కువ. అయితేనేం? దాని ముఖంలో యెంత కళ. ఏం లాభం" నిట్టూర్చింది సుభద్రమ్మ. సరస్వతి పెళ్ళి యెలాగో అయిం దనిపించేరు. తనకే బాధగా వుంటుంది అతన్ని అల్లుడిగా చెప్పుకో డానికి. లేడి పిల్ల లాంటి సరస్వతి యెలా భరిస్తోందో? కాత్యాయని అదృష్ట మెలావుందో? ఏమౌతుందీ కుటుంబం? మిగిలిన పిల్లల భవి ష్యత్తు యేమిటి? వచ్చేది తినటానికే చాలటంలేదు. రంగడు పాపం. అభిమానం వదులుకుని ఆ చిన్న వుద్యోగంలో చేరాడు. వాడి మొహాన కళా కాంతిలేవు. అందరూ యెందుకొచ్చిన బ్రతుకులో అని ఈసురోమన్నట్టే వుంటున్నారు. ఒక్క కాత్యాయనిలోనే ఆ నీరసం కనిపించటంలేదు. దానికేమి ఆశలు వున్నాయో భవిష్యత్తు మీద? విరక్తిగా నవ్వుకుంది సుభద్రమ్మ.

"అదేమిటా కన్నీళ్ళు? ఏమిటి ఆలోచిస్తున్నావు? స్టవ్ మండి పోతోంది చూట్టంలా?" భర్త పలకరింపుకి, ఉలిక్కిపడింది సుభద్రమ్మ. చటుక్కున కొంగుతో ముఖం తుడుచుకుంది. ఏడుస్తున్నట్లుకూడా తెలియలేదు తనకి. ఏదీ తమ చేతిలోలేదు. అన్నీ పరిస్థితుల ననుస రించి సాగుతున్నాయి. తనకు తెలిసి బ్రతుకులో సుఖంలేదు. ఆఖ రికి ఏడుపుకూడా తన యిష్టాయిష్టాలతో పనిలేకుండా....

"ఏవిటలా వున్నావ్ సుభద్రా! ఎందుకంత బాధ పడతావు. అసలే ఆరోగ్యం బాగులేని దానివి. ఊరికే బాధపడి యేం సాధించ గలం చెప్పు. జరిగేదేదో జరక్కమానదు."

*  *  *

"ఈ సోప్ వాడిచూడండి. మీరింతకు ముందు వాడేవన్నీ దీనిముందు దిగదుడుపే. ఏ కాలంలోనయినా వంటికి మంచిది. మెత్తగా, మృదువుగా, నురుగు యెక్కువ. సున్నం పాళ్లు ఎక్కువ మిగతా సోపుల్లో. దీంట్లో ఆ బాధలేదు. మీ ముఖంలో నునుపు తగ్గ నివ్వదు. వాడిచూడండి అసలు. ఈ రెండు సోపులు కొన్నారంటే ఇదిగో ఎంత బాగుందో చూశారా. ఈ ప్లాస్టిక్ గ్లాసు ఉచితం. మరీ, ఈ బట్టలుతికే పొడి 'మోర్ వైట్' చూడండీ. చిటికెడు పొడివేస్తే

చాలు....” ఓ చేతికి పొదుగాటి బేగ్ తగిలించుకొని, మరో చేతిలో పెద్ద పాకెట్ పట్టుకుని, వాడిన ముఖంతో అలసి యింటికి చేరిన కాత్యాయని తల్లిముందు నిల్చుని, ఈ మాటలన్నీ పాఠంలా వప్ప గించింది. ఆపైన ఫక్కున నవ్వింది.

“ఎలా వుందమ్మా మన వుద్యోగం?”

సుభద్రమ్మకి ఏడుపు ముంచుకొచ్చింది. ఎవరిమీనో చెప్పలేని కోపం బుస్సున పొంగింది.

“ఒళ్ళమ్ముకోటం తప్ప, మరేం అమ్ముకున్నా తప్పులేదులే. పో, పోయి ముఖం కడుక్కో. కుంపటిమీద కాఫీవుంది తాగు.”

నివ్వెరపోయింది కాత్యాయని. మరుక్షణం చిరునవ్వు నవ్వి అంది. “కోపంగా అన్నా, ఉన్నమాట అన్నావమ్మా! ఐతే మరో టుంది. ఆత్మాభిమానాన్నికూడా అమ్ముకోను. ఆ రెండూ తప్ప, రోడ్లో జంగిడి పెట్టుకుని....చేగోడీలు, జంతికలు అమ్మినా మరేం తప్పులేదూ ...అంతలో మన పరువు పోయేదీలేదు” అని ముందుకు వెళ్ళి, మళ్ళీ వెనక్కొచ్చి, తల్లి భుజంమీద చేయివేసి అనునయంగా అంది.

“అమ్మా! మన రామం కాస్త మంచి చదువు చదువుకో వాలా లేదా? తమ్ముడికీ చదువు చెప్పించాలి. ఇంకా చెల్లాయుంది. వీళ్ళ ముగ్గురికోసమేనా మనం ఆలోచించద్దా చెప్పు. అనవసరంగా ఆలోచించి మనసు కష్టపెట్టుకోకమ్మా!”

‘‘కష్టంకాక ఏముందే? నీకూ పెళ్ళీడు దాటుతోంది. రంగడికీ పెళ్ళిచేయాలి. పిల్లల చదులూ....’’

‘‘అబ్బబ్బ! పెళ్లి, పెళ్లి అని ఒకటే ఇదవకే అమ్మా. నాకేం పెళ్లిమీద మనసులేదు. నువు చేస్తానన్నా నేను చేసుకోను. ఇక అన్నయ్య కంటావా? యెందుకు చెప్పు మరో ప్రాణిని మన ఇంద్రభవనంలోకి ఆహ్వానించడం?’’

* * *

‘‘ఏవండీ’’ తలుపు తట్టింది కాత్యాయని బేగ్ సరిచేసుకొని, ముఖంమీద చెమట తుడుచుకుంటూ.

''ఎవరూ'' అంటూ తలుపు తీసిందా యింటావిడ. చూపి యెవరన్నట్లు ముఖం చిట్లించింది.

బేగ్‌లోంచి సోప్‌తీస్తూ ''నేను....'' అంటూ యేదో చెప్ప బోతుండగానే ''నీ సోది వినడానికి నాకు టైమ్‌లేదు తల్లీ, వెళ్లు.... వెళ్లు'' అంటూ తలుపు దఢాలున మూసిందావిడ.

''ఛీ'' కోపం ముంచు కొచ్చింది. వెనుదిరిగి, ఉసూరుమంటూ నడక సాగించింది. 'అబ్బ! యెండ పీల్చేస్తోంది. అలా ముఖం మీద తలుపేస్తుందేం. గంగిరెద్దులా వుంది. వంటినిండా నగలూ అదీను. ఓ నిమిషం నిలబడలేదూ! నిజమే. వంటింట్లో ఏ అర్జంటు పనిమీదో వుండి వుండచ్చు. ఏ గారెలో వేగిపోతూవుండి వుండచ్చు. పాలు పొంగిపోవచ్చు. మొగుడు భోజనంచేస్తూ మంచినీళ్ళకోసం గావుకేకలు పెట్టొచ్చు. తన 'సోది'....సవ్వాస్తుంది నిజంగా. సోదే మరి. ప్రతి యింటిముందూ నిలబడి ఇదేపాఠం వప్పచెప్పడం. నిజా నికి గృహిణులు యెంతో బిజీగా పనుల్లో సతమత మవుతుంటారు. తమలాంటి వాళ్లు ఈ చచ్చు పాఠాలు వప్పచెపుతుంటే వాళ్లకీ విసు గ్గానే వుంటుంది మరి.

బయటే కూర్చున్నారెవరో....వీళ్ళ చేతనైనా ఓ ఫినాయిల్ బాటిల్, నాలుగు సోప్స్ కొనిపించాల....'

''ఏమండీ....ఈ సోప్....'' అంటూ మొదలెట్టింది కాత్యా యని. బుగ్గన చేయి వేసుకుని చోద్యంగా చూస్తోందావిడ. పడక కుర్చీలో పడుకుని, అర్ధనిమీలిత నేత్రుడై, బొజ్జ నిమురుకుంటూ, పరవశంగా వింటున్నాడు. ఆవిడ భర్త కాబోలు. చెప్తూనే అతన్ని గమనించింది.

'వేదపాఠం వింటున్న విప్రోత్తముడిలా ఏవిటా పోజు'అను కుంది. తను చెప్పే మాటలు చెవులకీ విసుగ్గా వుంటున్నాయి. ఏవి టలా చూస్తాడు?

'ఓహో! చెవులు కాదు కళ్ళు అప్పగించేడు మహానుభావుడు. పక్కన మహిషిలా పెళ్ళాం వుందనైనా లేదు.'

''ఈ సోప్ కొని చూడండమ్మా?'' చివరిమాటగా అని, ఆవిడ

చేతిలో పెట్టింది.

ఆవిడ వింత పదార్థాన్ని చూస్తున్నట్టు దాన్ని అటు, ఇటు తిప్పి చూసి, ఆ తరువాత "అమ్మో! తేలు" అన్నంత గాభరాగా కాత్యాయని చేతిలో పడేసింది. "మా కొద్దమ్మా? ఇంటి నిండా సబ్బులు. ఎక్కడ చూసినా అవే" అంది.

"అయినా సరే....ఇవి కొని ఒక్కసారి చూస్తే...."

"అబ్బే! వద్దన్నాగా! చెప్పాగా యింటినిండా సబ్బులేనని.ఏం చేసుకోడం కొని...." సాగదీసింది.

'తిను పోనీ' మనసులోనే అనుకుని, పైకి చిరునవ్వు నవ్వి "పోనీ ఫినాయిల్ తీసుకోండి. బాత్‌రూమ్స్ ...."

"అబ్బో! అవీ వున్నాయి అరడజను సీసాలు."('ఎందుకూ! తాగుతావేంటి రోజూ!')

కాత్యాయని మరి కొంతసేపు ప్రయత్నించి చూసింది.

'ఉహు! లాభంలేదు. పాపం ఆడపిల్ల, ఎండలో పడి అమ్ముతుంది అని జాలైనా లేదు' తిట్టుకుంది లోలోపల.

వెనుదిరిగిపోతూ కుర్చీలో చూసింది. ఇంకా అలా సగం మూసిన కళ్ళలోంచి చూపులు రువ్వుతూనే వున్నాడు.

'ఛీ! ఎంత ఆబ ఆ చూపుల్లో. పొరపాటున కూడా ఇలాంటి వాళ్ళకి తన తల్లీ, కూతుళ్లు గుర్తుకు రారు కాబోలు' చిర్రెక్కింది కాత్యాయనికి. వెళ్ళబోతున్న కాత్యాయనిని వెనక్కి పిలిచిందావిడ.

ఆశగా వెనక్కి తిరిగింది కాత్యాయని.

"మీదే కులం?"

'ఓసినీ' అనుకుంది లోపల. వస్తున్న కోపాన్ని అణుచుకుంటూ, జవాబు చెప్పింది.

"అలాగా! ఇంటి పేరు...." మరింత కుతూహలంగా అడిగింది. చెప్పింది కాత్యాయని.

"విన్నారా! మన వియ్యాలారి యింటి పేరే! ఇదేం వుద్యోగం అమ్మాయ్ నీకు?" చనువు ప్రదర్శిస్తూ మందలింపుగా అంది.

ఒళ్ళు మండింది కాత్యాయనికి. "ఏం మీరిస్తారా?"

"ఏవిటి?"

"ఇంతకన్న మంచి వుద్యోగం!"

"బాగుంది....నాకేం పట్టిందీ?"

"ఏమీ పట్టనట్టుగానే వుంటే పోలా! ఈ ప్రశ్నలు మాత్రం ఎందుకూ?" గిరుక్కున వెనుదిరిగింది కాత్యాయని.

"విన్నారా! ఎంత పొగరో!"

బుస్సున పొంగింది కోపం కాత్యాయనికి. 'ఛీ! ఇటువంటి వాళ్ళతో మాట్లాడి యేం ప్రయోజనం? పోనీ!' అనుకుంటూ ముందుకు సాగింది.

మరో యింటిముందు.

టైము పన్నెండు దాటుతోంది. నిద్రపోయే వేళ భోజనాలు కానిచ్చి, విసుగ్గా వుంది.

"ఏవండీ!" 'అబ్బ! ఈ యెండ ఒకటి: దాహంతో గొంతుక ఎండి పోతోంది. ఇందాకా ఆ మొహాన్ని అడగాలంటేనే నోరు రాలేదు.'

తలుపు తెరుచుకుంది. గళ్ళ లుంగి, కట్ బనీను. కళ్ళు నము లుతూ "ఎవరు కావాలి?" అన్నాడో యువకుడు రెండు తలుపులమీదా చేతులు ఆన్చి, ముందుకు వంగి.

"నేను...." అంటూ మళ్ళీ పాట. సగంలో ఆపి "ముందు నాకు కాస్త మంచినీళ్ళిస్తారా?"

"ఓ! తప్పకుండా. లోపలకి రండి" పక్కకి తొలగి దారి యిచ్చాడు.

'అబ్బో! మర్యాద బాగానే వుందే' అనుకుంటూ, లోపల కడుగుపెట్టింది. అమ్మయ్య, తలుపుకి కొద్దిదూరంలో కిటికి దగ్గరగా స్టూలుమీద వున్న టేబిల్ ఫాన్‌గాలి తగిలి, ప్రాణం లేచొచ్చింది. చుట్టూ చూసింది. ఫాన్ కెదురుగా,ఇటువేపు గోడకి ఆన్చిన మంచం. అటు అలమార్లో అద్దం దువ్వెన వగైరా సామాను. బట్టల స్టాండుకి చొక్కాలు, పాంట్లు వేలాడుతున్నాయి.

గదిలో మూలగా వున్న కూజాలోంచి నీళ్ళు గ్లాసులోకి వంపాడు. 'బ్రహ్మచారి గది.'

తాగి, "చాలా థాంక్సండీ!" అంది సేద తీరుతూ! "వస్తానూ!" అంటూ గుమ్మంవేపు అడుగువేసింది.

ఆమె మంచినీళ్ళు తాగుతున్నప్పటినుండి, అతని చూపులు అదో రకంగా ఆమెని నిలువునా తాకుతున్నాయి.

"అరే వుండండి. బయట చాలా ఎండగా వుంది. మొహం బాగా వాడిపోయినట్టుంది. కాసేపు గాలి పీల్చుకుని వెళ్ళండి" టేబిల్ ఫాన్‌ని పూర్తిగా ఆమెవేపు తిప్పుతూ అన్నాడు.

మరో స్విచ్ నొక్కాడు.

గాలి ఇంకా వేగంగా వస్తోంది. ఆమె మొహంమీద ముంగురులు అటు ఇటు కదులుతున్నాయి. ఫాన్ చప్పుడు మాత్రం భీకరంగా వుంది. 'వంతెనమీద రైలు వెళ్తున్నట్లుంది. ఎలా భరిస్తాడబ్బా యీ హోరు....' అనుకుంటూ దాని చప్పుడుకి నవొచ్చింది కాత్యాయనికి.

"కూర్చోండీ! నిలబడే వున్నారు" ఆమెను రాసుకుంటూ నడిచి, తలుపు దగ్గిరికి వెళ్ళాడు.

ఉలిక్కిపడింది కాత్యాయని. కారా కిళ్ళీ వాసన గప్పున కొట్టింది.

"అబ్బే! మరేం ఫర్వాలేదండీ! చాలా థాంక్స్. వస్తా" తలుపువేపు మరో అడుగు వేసింది. రెండు అడుగులు వేస్తే, తలుపందుకోవచ్చును.

"అరే అంత తొందరేమిటి? వుండండి....ఇవాళ మీ బాగ్‌లో వున్న సోపులన్నీ నేనే కొనేస్తాను" గారపళ్ళు బయటపెట్టి నవ్వాడు తలుపు మూస్తూ.

"మై గాడ్....!" కాత్యాయని గుండె గుభేలుమంది. మెరుపులా ముందుకు వచ్చి, అతని చేతిని లాగేసి, తలుపు తెరిచింది.

ఇంత హఠాత్తుగా ఆమె యేం చేయగలదని వూహలో

వున్నాడేమో క్షణం తెల్లబోయాడు.

ఆమె యింకా గడప అవతల కాలు పెట్టలేదు. చెయ్యి పట్టుకుని లోపలికి గుంజబోయాడు. ఒక్క విదిలింపుతో వదుల్చుకుని, ముందుకు తూలిపడింది.

అతనూ వెనక్కి పడబోయి, నిలదొక్కుకున్నాడు.

'ఇంక లాభంలేదు. రోడ్డుమీద యెవరేనా వస్తుంటే....' దూరంగా యెవరో రావటం కనిపించింది. ఆమెకి వినపడకుండా ఏదో గొణిగాడు.

ఆమె లేచి నిల్చుంది తోకమీద లేచి నిల్చున్న పాములా బుసలు కొడుతూ।

ఇంకా అలాగే చూస్తున్నాడు కిళ్ళీ నవ్వులుతూ। ఏదో అనబోయాడు. ఓ అడుగు ముందుకు వేసి, నిబ్బరంగా నిలబడి, చేయి చాచి, బలంగా అతని చెంపమీద కొట్టింది.

అతని కళ్ళు బైర్లు కమ్మినట్లయ్యాయి. తేరుకుని చూసేసరికి రోడ్డుమీద పది అడుగుల దూరంలో చకచక నడుస్తూ కన్పించింది. చెంపమీద తడుముకుంటూ, కోపంగా ఆమె వెళ్ళిన దిక్కే చూస్తూ వుండిపోయాడు.

* * *

"మామయ్యా! మనుషుల్లో యింత లేకితనం యెందుకు పుడ్తుందో? వాళ్ళ నీచత్వం వాళ్ళ కేనాడైనా బోధపడుతుందంటారా జన్మలో. ఒక్కసారి ఆలోచించరు కాబోలు—ఎంత హీనమైన స్థితిలో తాముంటున్నదీను."

"దట్టంగా మురికి పేరుకుపోయుంటుంది, అసలు పదార్థాన్ని మూసేస్తూను. సంస్కారం, మనస్సులో స్వచ్ఛత యివి నిలుపుకోవడానికి కృషి కూడా అవసరమమ్మా!"

"అవి సహజంగా వచ్చే గుణాలు కదా!"

"కొంతవరకే! మనకే తెలియని ఎన్నో ప్రభావాలు మనమీద పనిచేస్తూ వుంటాయి. ఇంటి బూజు దులిపి, కడిగి ఎలా శుభ్రం చేస్తూ వుంటామో అలాగే తన్ను గురించి తాను విమర్శ చేసుకుని

చూసుకోవడం అనేది కూడా చాలా ముఖ్యం. అది ఎవరూ చేయరు. ఎంతో మాలిన్యం చేరుతూ వుంటుంది కంటికి కనబడక. అసలా దృష్టే వుండదు మనిషికి. బుద్ధిని, వివేకాన్ని జోకొట్టి, మనసు చెప్పినట్టల్లా ఆడతాడు."

"అతను చూస్తే చదువుకుంటున్నవాడిలా వున్నాడు. ఏ కాలేజి స్టూడెంటో అయ్యుంటాడు. కాని, నిజంగా అతన్ని చూస్తే ఆ నిముషంలో యెంత అసహ్యం, ద్వేషం కలిగాయని. చేతిలో ఏదైనా వుంటే....అతన్ని మర్డర్ చేసి వచ్చేద్దును."

"హుఁ!" నిట్టూర్చాడు ప్రకాశం. "చదువు ఎంత సంస్కారాన్ని నేర్పుతుందీ అనేది ఒక ప్రశ్నే. కొందరికది బూడిదలో పోసిన పన్నీరే. అటువంటివాళ్ల మనసు గాలీ, వెలుగూ చొరని ఇరుకు గది లాంటిది. దాని తలుపులు తియ్యాలని వారాశించరు. విశాలత్వం అనేది వారికి అక్కర్లేదు. అలాగే జీవితమంతా గడిపేస్తారు. దానికి తోడు, మన సంఘంలో ఒక విచిత్రమైన పరిస్థితి. స్వార్థం, సంకుచితత్వం కుప్పతిప్పలుగా పేరుకున్నాయి. చక్కని పువ్వుని చూసి ఆనందించలేరు. దొరికితే నలిపేస్తే బాగుండుననే రాక్షసత్వం."

"అసలు మన ఆచారాలు, పద్ధతులు ఇందుకు కొంత కారణమే అనిపిస్తుంది మామయ్యా! చలంగారు చెప్పినట్లు సెక్స్ విషయంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నెలకొనివుంటే....ఇలాంటి దొంగ చాటు పద్ధతులు, బలాత్కారాలు, ఆడదాన్ని చూపి చొంగ కార్చడాలు లేకపోనేయో!"

"అది ఏనాడూ జరగని పని కాత్యాయనీ! చలంగారు ఆశించి నటువంటి సమాజం ఏనాడూ ఏర్పడదు. పూర్తిగా అసంభావమైనటువంటి వూహా లోకంలో ఆయన విహరించారని చెప్పవచ్చు. మనిషి తల్లిని గుర్తుపట్టడం ఏనాటినుంచి ఆరంభిస్తాడో....ఆనాడే అతనిలో స్వార్థం ప్రవేశిస్తుంది.

"నాది....నాకు కావాలి నాకు చెందినది....అనే భావమే అతనిలో పెరుగుతూ వుంటుంది వయసుతోపాటు. 'నాకే వుండిపోవాలి.

మరొకళ్ళకి చెందకూడదు' అనేది స్వార్ధంలో సర్వసాధారణమైన మరో మెట్టు. అది ఎక్కువగా జీవిత భాగస్వామిని విషయంలో వృథంగా వుంటుంది.

"తల్లి మరో పిల్లని తనతో సమానంగా ప్రేమించినా, సర్దుకు పోగలదు కాని....భార్య మరో పురుషుడ్ని మనసులో తలచిందీ అంటేనే సహించడు. ఆమె పూర్తిగా తనది. తనకే చెందాలి అను కుంటాడు. ఇక మన దేశంలో సెక్స్ అనేది ఒక శారీరక అవసరం క్రింద మాత్రమే ఒప్పుకోరు.

"దానికో పవిత్రత, నిబంధనలు జన్మ జన్మాల పాపపుణ్యాలు వగైరా అంటగట్టి....ఆ సంబంధం అంటేనే అదేదో 'చేయరానిది' అనే భావం కల్పించారు. ఇటువంటి సమాజంలో, చలంగా రాశించిన మార్పు రావడం సంభవమా? స్వార్ధం అనేది మనిషికి అత్యంత సహజం.

"అది అతని రక్తంలో రక్తమై ప్రవహిస్తూ వున్నన్నాళ్లూ.... చలం రాతలు నేలవిడిచిన సాములే. 'తన' అనే భావం మనిషినుంచి పోదు. అది పోనన్నాళ్ళూ, చలం 'స్త్రీ'ని ఈ సమాజం భరించలేదు. అంతదాకా ఎందుకు....అమీర్....రాజేశ్వరిని, తన హక్కులాగా లేవ దీసుకు వచ్చినవాడు, అంత రసికుడు, ప్రేమించేవాడూ....'మీరా' విషయంలో యెంత కర్కశంగా వుంటాడో....చదివావుగా."

"అవును మామయ్యా! నాకూ అదే వూహ కలిగింది. ఇదే విధమైన స్వార్ధం రాజేశ్వరి భర్తలోనూ వుంటుంది. అది సంకుచిత త్వంగానూ, ఇది ప్రేమగానూ యెందుకు కనపడాలి రాజేశ్వరికి? అని పిస్తుంది."

"అదే నేననేదీను. అయితే ఒకటి....కొన్ని ఆచారాలు ఛాంద సాలు సెక్స్‌ని అలా వెగటు కలిగించేలా చేశాయి. ఈ విషయంలో ఆయనతో ఏకీభవించకుండా వుండలేం!"

"ఇంతకీ అటువంటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మనవాళ్ళ కిచ్చినా మంచి జరగదంటారు?" నవ్వుతూ అడిగింది కాత్యాయని.

"అది క్రమంగా రావలసిన మార్పు. మనసుల్లో ఎవరికి

వారు ఆలోంచి, విశాలత్వం ఏర్పరుచుకుని ఎదగాలి. ఇది ఒకళ్ళిచ్చేది కాదు. అసలు ఏ సమస్యకైనా సరే, వ్యక్తిగతంగా, ఆలోచనా విధానంలో మార్పు రావాలి. ఆ పరిధి విస్తృతం కావాలి. అంతవరకూ ఏ సమస్యా పరిష్కారం కాదు."

అక్కడే కూచుని అన్నీ వింటూ వున్న పార్వతి, సుశీల అడిగారు. "అయితే మానేస్తావా ఈ వుద్యోగం?"

నవ్వేసింది కాత్యాయని. "భయపడి మానేయను. అత్తయ్యా! అసలే పెంపరరీ. దానంతట అదే పోనీ."

"ఎందుకు లెద్దూ యీలాంటి వుద్యోగాలు, లేనిపోని గొడవలు."

"అసలు ఆడవాళ్ళంతా 'కరాటే' నేర్చుకోవాలంటాను. మన వూరి మహిళామండలిలో అటువంటి ట్రెయినింగ్ ఒకటి పెడితే బాగుండును."

"ఎందుకూ? అలాంటి రౌడీలని చెంపదెబ్బలు కొట్టడానికా?"

"మరే! లేకపోతే చూడు సుశీ! శారీరకంగా మనం అష్టే బలవంతులం కాకపోవడం వల్లనేకదా ఇలాటి దౌర్జన్యాలు జరగడం. మనకికూడా కొంత శరీర దారుఢ్యం అవసరం."

"బలేమాటలు చెప్తావు కాత్యా" నవ్వింది పార్వతి.

"నిజమే అత్తయ్యా! నేను సీరియస్‌గా చెబుతున్నాను. తప్పకుండా ప్రతివాళ్ళకీ కొంత దౌర్జన్యాన్ని యెదుర్కొనే పద్ధతి తెలిసి వుండాలి. వింటే నవ్వుగానే వుంటుంది కానీ, ఆలోచించి చూడు. ఎంత అవసరమో! నాకు తటస్థపడిన పరిస్థితుల్లో, అలాంటి శక్తి అవసరం. కనీసం కొన్ని చిన్నచిన్న ప్రమాదాలనయినా తప్పించుకోవచ్చు. పేపర్లలో చూట్టంలేదూ....ఆడవాళ్ల మీదెంతంత దురాగతాలు జరుగుతున్నాయో. ఇంకా మనకి తెలియక యెన్నిజరుగుతున్నాయో!"

"నిజమే సుమా!"

"ఇంకేం, మహిళా మండలిలో రేపట్నుంచి ఈ క్లాసులు ప్రారంభించండి." ప్రకాశం వేళాకోళంగా అన్నాడు.

"ఏం చేద్దామన్నా అందరూ కలిసి రారండీ!" పార్వతి మామూలుగానే అన్నది అతని వేళాకోళం పట్టించుకోకండా.

"అసలు మీ మహిళామండల్లో చీరలు సవరించుకోడం కొప్పులు సవరించుకోడం తప్ప యిలాంటి సంఘాన్ని సవరించే పనులు యెవరికా్కవాలి. అసలు మూడు కొప్పులోచోట యిమడ వంటారు. అలాంటిది అన్నికొప్పులొకచోట చేరితే...."

"ఆ! మీకంతా వెటకారమే. ఈ మగాళ్ళు మాత్రం మహా వూడబొడుస్తున్నట్టు."

"అదేమోగ్గాని మీ ఆడవాళ్ళలా అనవసరపు కబుర్లు మాత్రం చెప్పం."

"ఔనౌను. మీ క్లబ్బులో కాబరే డాన్సర్ దగ్గర్నుంచి, వీధిలోని ముష్టిదానివరకూ చర్చలే. తెలియదనుకున్నారా?"

"చూశావా కాత్యాయనీ, అన్నీ తెలిసినట్టు మీ అత్తయ్య మాటలు."

"ఏమిటివాళ యిద్దరూ వాగ్యుద్ధంలోకి దిగారు. మరికాసేపు కానివ్వండి. నేను, సుశీల చక్కగా ఎన్‌జాయ్ చేస్తాం."

"సుశీలా నువ్వుమాత్రం యిలా నేర్చుకోకమ్మా." ప్రకాశం నవ్వుతూ భార్యని వెక్కిరించాడు.

"ఇలా వాదులాడడానికి కూడా టైముంటుందంటారా ఆ డాక్టరుగారికి."

"ఏవిటి మామయ్యా! సుశీలకి పెళ్లి....నిశ్చయించేశారా? చూశారా....నాతో చెప్పనేలేదు" కాత్యాయని బుంగమూతి పెట్టింది.

"ఏదీ! నువ్వొచ్చి పదిహేను రోజులయింది. ఇటువేపు రానేలేదు. ఇన్నాళ్ళూ తటపటాయించాను గాని యిప్పుడీ నిర్ణయాని కొచ్చి, మీ మామయ్యని వాళ్లకి వుత్తరం రాయమన్నాను. సుశీలను చూసి చాలా రోజులయింది. వాళ్లూ పిల్లని చూపినట్లు వుంటుందని రమ్మని రాశాం. మొత్తానికి, నాలుగురోజుల్లో తల్లీ, కొడుకూ రావచ్చు." పార్వతి సంతోషంగా చెప్పింది.

"ఇంకేం సుశీలకి మేం ఇంక కనపడం! ఔనా!"

"మరే! డాక్టరొచ్చి కళ్ళకి గంతలు కడతాడా?"

"కళ్ళకి గంతలే కడతాడో, ముక్కుకి తాడే కడతాడో. ఏం కట్టినా, ఈ స్నేహితురాల్ని మరచిపోకు సుమా!" కాత్యాయని ముఖంలో నిజంగానే దిగులు కనిపించింది. అంతలోనే మామూలుగా అయి "సుశీల పెళ్ళికూతురాయెనే" అంటూ పాడింది సన్నగా.

"నీ కంఠం చక్కగా వుంటుంది కాత్యాయనీ! సంగీతం నేర్చుకుంటే బాగుండిపోయేది." సుశీల, సిగ్గు మీద పడకుండా, తప్పించుకుందికి, మాట మార్చింది.

"ఆ పని మా చిన్న చెల్లాయికి! దానికిప్పట్నించే నేర్పిస్తే బాగుంటుంది. దాని కంఠం యెంతో బాగుంటుంది తెలుసా! మేమేం నేర్చుకోలేకపోయినా, దానికైనా ఆ అవకాశమివ్వాలని ఆశ."

"కళ ఈ రోజుల్లో ఖర్చుతో కూడిన పని. ఎంత ఆసక్తి వుంటే మాత్రం యేం లాభం?" పార్వతి, కుర్చీలోంచి లేచి, లోపలకూ వెళ్తూ అంది.

'నిజమే. కేవలం డబ్బు లేకపోవడమనే లోపం వల్ల: ఎంత సామర్థ్యం వున్నా నిష్ప్రయోజన మవుతోంది. అందులో తమలాంటి వాళ్ళకి మరీను.' నిట్టూర్చింది కాత్యాయని.

* * *

"అమ్మా ఇదిగోనే చీర నీకు. యెలా వుంది చెప్పు. ఒరే తమ్ముడూ, కలర్ పెన్సిల్స్ యివిగో! బాగా వెయ్యాలిబొమ్మ."

"ఓ ఫస్టు ప్రయిజ్ కొట్టేస్తా చూడు."

నవ్వింది కాత్యాయని. "అలాగేలే! జాగ్రత్తగా వెయ్యి. తొందరపడకు. ముదరరంగులు ఎక్కువ వాడకూ."

"ఏవిటే అదీ?"

"వాళ్ళ స్కూల్లో డ్రాయింగ్ టీచర్ ఓ కాంపిటీషన్ పెట్టారుట. అందుకనే ఆ పెన్సిళ్ళు అవీను."

"సర్లే! ఈ చీరెందుకు కొన్నావిప్పుడు? నువ్వు కొనుక్కోపోయావా?"

"నాకున్నాయిలే చాలు. నాన్నగారేరీ! చొక్కా తెచ్చాను."

"బాగుందమ్మా! మగపిల్లవాడితో సమంగా. క్రిందటి వాడి జీతంలో ఓ చీర తెచ్చాడుగా. నీ జీతం నువ్వేమైనా ఖర్చుచేసుకో వలసింది. ఆడపిల్లవి....చేతికి ఓ బంగారు గాజు కూడా లేదు. మెళ్లో...."

"అమ్మా! ఈజీతానికి బంగారం కూడానా! అయినా ఇప్పుడు బంగారం లేపోతే ఏమొచ్చే గానీ....నీకు కట్టుడు చీరలు కావాలి. అందుకే తెచ్చాను."

"ఒకటి అక్కకి పెట్టి పంపుతాను." స్వగతంగా అను కుంటూ, చీరమీద వేలితో రాయసాగింది సుభద్రమ్మ.

"అంటే నీకు కోపమొస్తుందిగాని అమ్మా, అక్కకి మనం పెట్టవలసిన పనేముంది చెప్పు. ప్రతి పైసా మనం లెక్క చూపి చూపి....ఖర్చుపెట్టుకుంటున్నాం. దానికిప్పుడు కావలసినన్ని చీరలు, నగలూను. మనమే పెట్టాలా ఈ పాతికరూపాయల చీర. అదేవుంటే నీకెన్నాళ్లు గడుస్తుంది చెప్పు."

సుభద్రమ్మ నిట్టూర్చింది. కూతురి మాటల్లో నిజం వుంది. ఈ చీరే వుంటే తనకి మరో ఏడాది దాకా గడిచిపోతుంది. చుట్టు పక్కలవాళ్ళకోసం, కూతురికి వెళ్ళేటప్పుడు చీర పెట్టానని చెప్పడం కోసం, పెట్టాలి తను. ఏ మొగుడో, ఓ మొగాడు, దానికి సంఘంలో గౌరవం, తిండి బట్టకి లోటులేని పరిస్థితీ....ఏర్పరిచాడు దేవుడు. అలా ఆలోచిస్తూ నిల్చున్న తల్లిని చూసేసరికి జాలివేసింది కాత్యాయ నికి- జీవితంలో ఎంతో అలసిపోయినదానిలా, నీరసంగా, నిరుత్సా హంగా....ప్చ్! ఏమిటో అమ్మ! రంగన్నయ్య కూడా కొద్దో గొప్పో నాన్నకి తోడుగా సంపాదిస్తున్నాడు కాబట్టి, పరిస్థితి కొస్త ఫర్వా లేదు. రేపు నాన్న రిటైరయితే....ఛెళ్ళున కొట్టినట్టయింది కాత్యాయ నికి. ఈ వూహ యిన్నాళ్ళూ రాలేదు. ఏమిటి రేపటి గతి? రామాన్ని ఏదయినా టెక్నికల్ కోర్సులో పెట్టాలి. తమ్ముణ్ణి, చెల్లాయిని చది వించాలి. అన్నయ్య జీతం తిండికే చాలదు.

కాత్యాయని ముఖంలో నవ్వు మాయమైంది.

"పదవే కాస్త ముఖం కడిగి కాఫీ తాగు. అక్క ఇంటావిడతో కూర్చుంది. పొద్దున్నుంచి నీ కోసం తపించిపోతోంది ఎప్పుడు వస్తావా అని. పద."

కాఫీ గ్లాసు చేతికందిస్తూ, ముసి ముసిగా నవ్వుతూ చెప్పింది సుభద్రమ్మ. "సరస్వతి కిప్పుడు మూడో నెలట."

"ఆ!"

"అలా తెల్లబోతావేమిటే ఏదో వింత విషయం విన్నట్టూ" సుభద్రమ్మ నవ్వేసింది గట్టిగా.

"అమ్మకెంత సంతోషం!! ఈ సంతోషం ఎలా వచ్చిందో అమ్మ మొహంలోకి? ఎన్ని బరువులు దిగలాగుతున్నా? అప్పుడప్పుడు ఇలా తేలిగ్గా నవ్వగలుగుతుంది అమ్మ. అదే జీవితంలోని తమాషా అనుకుంటాను.'

"అక్కా!" దగ్గరగా వెళ్ళి, ఆమె చేతుల్ని చేతిలోకి తీసుకుంది ప్రేమగా. జాలిగా కూడా వుంది ఆమెకి. నీరసంగా కనిపిస్తోంది సరస్వతి. ముఖంలో ఏదో తృప్తి. ఎంతో పెద్దదానిలా కన్పిస్తోంది.

"ఇలా చిక్కిపోయావేమిటే! నల్లబడ్డావు కూడాను."

"అక్క చెల్లెళ్ళిద్దరూ మాట్లాడుకోండి. కలుసుకుని ఏడాది దాటుతోంది పాపం. రేపు మీ అక్కకి మామిడికాయలు తెచ్చిపెట్టు కాత్యాయనీ" నవ్వుతూ ఇంటావిడ మెట్లుదిగి వెళ్ళిపోయింది.

*    *    *

రాత్రయింది. "మరి కాస్త పచ్చడి వేసుకు తినవే!" ఆప్యాయంగా కొసరి కొసరి వడ్డించి తినిపిస్తోంది సుభద్రమ్మ. "వద్దమ్మా! సహించటంలేదు...."

ఓరగా చూసింది అక్కవంక. యెలా వుందీ అక్క. ఎంత మార్పు!! అమాయకంగా, జాలిగా తన ముందు చిన్నపిల్లలా వుండే అక్క... ఇప్పుడు ఆమెదగ్గర పూర్వంలా దబాయించి మాట్లాడేలా లేదు తను. అక్క ముఖంలో ఏమిటో ఆ ముద్ర? ఆ నిర్లిప్తతా! సర్దుబాటా?

వంటింట్లో పని ముగించుకుని సుభద్రమ్మకూడా వచ్చి పడుకుంది. భర్త, సవితిపిల్లలు వీళ్ళ కబుర్లేవో చెప్తోంది సరస్వతి. ఆసక్తిగా లేదు కాత్యాయనికి.

'అక్క గర్భవతి అంటే తనకెందుకో సంతోషం కలగటం లేదు. అక్క సంతోషంగా వుంటోందా? ఆ సవితి పిల్లలు యెలా వుంటారు? భర్త ప్రవర్తన ఎలా వుంటుందో? ఆ విషయాలు చెప్తే బాగుండును.'

సుభద్రమ్మ అడుగుతోంది మెల్లగా "ఆ పిల్లలకు నువ్వంటే యిష్టమేనటే? అతను సరదాగా వుంటాడా?" ఓ నిముషం మౌనం తర్వాత చెప్పింది సరస్వతి.

"ఇష్టమూ లేదు అయిష్టమూ లేదు. వాళ్ళ గొడవ వాళ్లది, నా గొడవ నాది. తనూ....ఆయన బాగానే వుంటారు."

అసంతృప్తిగా వుందా సమాధానం కాత్యాయనికి. మెల్లగా నిద్రలోకి జారింది. కాసేపటికి ఎందుకో మెలకువ వచ్చింది- నిద్ర మళ్లీ రాలేదు. ఏవేవో ఆలోచనలు. "ఏవిటీ జీవితం. అర్థమేమిటి? దీనికి? మనిషి ఎందుకీ మనుగడ సాగిస్తున్నట్లు? ప్రతివారికి ఏదైనా లక్ష్యముంటుందా? ఏ లక్ష్యమూ లేకుండా తినడంకోసమే బ్రతకడం, బ్రతకడం కోసమే తినడం అన్నట్లు జీవితం గడిపేయడమేనా?అక్క పెళ్ళి ఓ పరమార్థం అన్నట్లు చెప్తుంది. అందుకే....ఏదో ఒకటి అని ఈ సంబంధం చేసేసుకుంది. అబ్బ! అంత లావు. అంత వయస్సున్న....ఆ మనిషి....ఎలా భరిస్తోందో అక్క. అసలాయన్ని చూస్తే వలపుటూహలు రేగుతాయా ఎవరికేనా? మొహం చూస్తే మామయ్యో, బాబయ్యో అని పిలవాలనుకుంది. 'ఏమండీ అంటూ నవ్వుతూ, సిగ్గువొలకబోస్తూ, అక్క కాఫీ గ్లాసందిస్తుంటే.... అందించగలదా....అలా....ఆ మోటు మనిషి అక్కని దగ్గరకి తీసుకుని ముద్దు....ఛీ! కూతురి వయసుది....ఎలా శృంగారం జరుపుతాడో....ముందసలు అక్క ఎలా భరిస్తోందో?' కేశవరావు గుర్తొచ్చాడు చటుక్కున. పాపం అక్క! మనస్సు భారమైపోయింది.

గడియారం పన్నెండు కొట్టింది పక్కింట్లోంచి. "ఇంకా పన్నెం

దేనా?" అంతా మంచి నిద్రలో వుండి వుంటారు. తన కేమిటివాళ నిద్ర రావటం లేదు. తన నెవరేనా చూస్తే ఏమనుకుంటారో? సెక్స్ కోరికలతో సతమతమవుతోందనుకుంటారేమో! అదేమిటో ఆ సెక్స్ పేరు చెప్తే తనకి అసహ్యంగా వుంటుంది. సుశీల మొహంలో డాక్టరు పేరు చెప్పేసరికి యెంత సిగ్గు వచ్చింది? ఏం వూహించుకుందో! ఏం శృంగార దృశ్యమో.... మొహం యెర్రబడింది. తన కెందుకో వెగటనిపిస్తుంది శారీరిక సంబంధం వూహించేసరికి. అందరికీ అలా వుంటుందా.... యెందుకుంటుంది. వుండదు. వుంటే అక్క ఈ వేళ యిలా వికారంతో డోకులతో.... సుశీల యెర్రబడ్డ ముఖంతో పులకించిపోతూ.... అబ్బ! ఆ వేళ .... ఇంటాయన అసహ్యంగా, ఆబగా.... గుడిసెలో సింహాచలం, రత్తాలు.... ఛీ! యెంత వికారం!! పందుల్లా.... జంతువుల్లాగే.... కాకపోతే మరేమిటి? ఛ.... ఛ....

"ఏయ్! సుశీ! ఉద్యోగం వూడింది. ఇక రెస్టే. మళ్ళీ ప్లాస్టిక్ బ్యాగ్‌లూ, అప్పడాలు పుచ్చుకుంటున్నాను."

సుశీల నవ్వింది. నవ్వులో కొత్తదనం కాత్యాయని గమనించింది.

అంతలోనే వచ్చాడు ప్రకాశం. "ఏవమ్మా! రావల్సిన డబ్బు తీసుకున్నావా పొద్దున్నవచ్చి? నే చూడలేదు నిన్ను?" అన్నాడు.

"ఆ! తీసుకున్నా. ఏదో ఆరు నెలలు కొత్త కాలం బాగానే గడిచింది."

అభిమానంగా చూస్తూ అన్నాడు ప్రకాశం. "కష్టానికి భయపడేదానివి కావు కనక బాగా గడిచిందనగలుగుతున్నావ్!"

"కష్టమే కాదు మామయ్యా! మీతో చెప్పానో లేదో గాని ఓరోజు ఓ యింటావిడ "ఏవండీ" అంటూ, జిడ్డుకారుతున్న ముఖంతో బేగ్ వేలాడేసుకుని, నీరసంగా పిలిచేసరికి "పో....పో.. ఇప్పుడేం లేదు. వెళ్ళు అని తలుపేసుకుంది."

కాత్యాయని చెప్పిన తీరుకి ప్రకాశం, సుశీల ఫక్కున నవ్వేశారు.

పక్క గలోంచి "మామయ్యా" అంటూ బయట కొచ్చా

డొక యువకుడు.

"ఆ! ఇతనే మా మేనల్లుడు రాజారావు. నీకు చెప్పాను చూడు" చిరునవ్వుతో, సూటిగా ఇటే చూస్తూ "నమస్కారమండీ" అన్నాడతను.

"కాత్యాయని అని సుశీలకి చిన్నప్పటినుంచీ స్నేహితురాలు. సుశీలకంటే కూడా నాకే యెక్కువ స్నేహితురాలు" నవ్వుతూ అన్నాడు ప్రకాశం.

"నువ్వు చాలా లక్కీ మామయ్యా అలా అయితే" సరదాగా చొరవగా అన్నాడు. కొద్దిగా ఆశ్చర్యపడింది.

కలుపుగోలు మనిషిలా వున్నాడే అనుకుంది.

సుశీల తుర్రుమంది లోపలికి, "ఏయ్! సుశీలా! నిన్నే నిన్నే" అంటూ వెనకే పరుగెత్తింది కాత్యాయని.

వంటింట్లో పార్వతితోపాటు కూర్చున్న మరో స్త్రీని చూసి, అతని తల్లి కాబోసు అనుకుంది.

కొంతసేపు గడిచింది కబుర్లతో "సుశీల ఒక్కత్తే అతనితో వెళ్ళడానికి సిగ్గుపడుతోంది. నువ్వు కూడా వెళ్లు కాత్యాయనీ సరదాగా" అంది పార్వతి.

"యెక్కడికి?"

"పార్కుకిట."

"సర్లే అత్తయ్యా!"

ముగ్గురూ, పక్క పక్కనే నడవసాగారు. రాజారావు సన్నగా, పొడుగ్గా చువ్వలా వున్నాడు. సుశీల అతని పక్క బాగా పొట్టిగా, బొద్దుగా కన్పిస్తోంది. సుశీల వూరికే సిగ్గుపడుతోంది. మాటలన్నీ కాత్యాయని, రాజారావుల మధ్యే జరుగుతున్నాయి. చనువుగా, ఏనాటినుంచో తెలిసిన వాడిలా చెప్తున్నాడు రాజారావు కబుర్లు. కాత్యాయనిది యించుమించు అటువంటి స్వభావమే కావడంవల్ల అరమరికలు లేకుండా ఫ్రీగా సంభాషణ కొనసాగిస్తోంది.

ఫౌంటెన్‌కి కొద్ది దూరంలో కూచున్నారు. అది చిమ్ముతున్న నీళ్లవేపు దీక్షగా చూస్తూ అంది కాత్యాయని: "నేనసలు

డాక్టరు చదువుదామని కలలు కన్నానండీ! మా పరిస్థితులకి ఆ మాట పైకి చెప్తే హాస్యాస్పదంగా వుంటుందనుకోండీ!"

"అదేం మాట" నొచ్చుకుంటున్నట్లుగా అన్నాడు.

"నిజమంతేలెండి. మీరు పల్లెలోనే ప్రాక్టీసు పెట్టడం నిజంగా మెచ్చుకో తగిన విషయం." మెప్పుదల ఆమె కన్నుల్లోనే కనిపించింది ఆతనికి.

"అందరూ పట్నాలకే ఎగబడితే ఎలా. ఎలాంటి పరిస్థితుల్లో నయినా సరే. ఆ పల్లెలోనే వుండదలిచాను" స్థిరంగా అన్నాడు. సుశీల ముఖంలో కాంతి తగ్గింది. అది గమనించారిద్దరూను.

"అబ్బో! ఆదర్శ యువక డాక్టరన్నమాట." తేలిగ్గా నవ్వేస్తూ అంది కాత్యాయని.

"యువక ఏమోగాని చవక డాక్టర్ని ప్రస్తుతం"

"ఫీజులు దండిగా వసూలు చేయకపోయినా కూడా ముప్పేనండీ. ఎంత యెక్కువ ఫీజులాగితే అంత పెద్దడాక్టరు."

"అక్షరాలా నిజం మీరన్నమాట. ఏదీ ఇప్పుడిప్పుడే పుంజుకుంటోంది."

"ఇకమీదట గుంజుకుంటా రన్నమాట" మధ్యలోనే టక్కున అని నవ్వేసింది.

పల్చని పెదవులమధ్య చిన్నగా, ముచ్చటగావున్న పలువరస గమనిస్తూ వుండిపోయాడు. ఆ ముక్కు యెంత సూదిగా, మొన దేరి వుందో. సన్నగా గీసినట్లున్నాయి కనుబొమలు. సుశీలనిచూస్తే గున్నమామిడి గుర్తుకొస్తుంది. ఈ పిల్ల సన్నజాజి తీగలా వుంది.

అతని చూపులు కలవర పర్చాయి కాత్యాయనిని.

"అలా చూస్తాదేం? సుశీల ఏమనుకుంటుంది?" ఇబ్బందిగా కదిలింది.

*   *   *

రాజారావుకి ఎంత వద్దనుకున్నా కాత్యాయనే కళ్ళలో మెదుల్తోంది. 'ఎంత చురుగ్గా, సూటిగా వుంటాయామె చూపులు. చలా

కీగా నవ్వుతూ, అప్పుడప్పుడు చురకలు తగిలిస్తూ మాట్లాడుతుంది. ఉత్సాహం, ఉత్తేజం ఆమె నరనరాన జీర్ణించుకు పోయినట్లుంటాయి. ఆమెలాంటి తోడు దొరికితే, జీవితంలో నిరాశ, నిస్పృహ దరికి రావు. అంత డైనమిక్‌గా వుంటుంది.' నాలుగయిదు రోజుల అనంతరం కాత్యాయనిని గూర్చి వూహలివి.

*　　　*　　　*

"సుశీలకి వల్లమాలిన సిగ్గు. నువ్వెళ్ళి కాఫీ యిచ్చిరామ్మా!" పార్వతి వంటింట్లోంచే కేకేసింది కాత్యాయనిని.

కాత్యాయని కాఫీగ్లాసు అందించింది.

"మీరుకూడా నాకు మర్యాదలు చేస్తున్నారే ఇది మీ యిల్లే అన్నట్టుగా."

"ఇది నా యిల్లే. కాదని ఎవరన్నారు?"

"అలాగా, ఈ ఇంట్లో మీకున్న చనువు, ఆప్యాయతచూస్తే మీ స్నేహంమీద నాకు అసూయ కలుగుతోంది సుమండీ."

"అసూయ అట్టే మంచిలక్షణం కాదు సుమండీ." అతన్ని అనుకరిస్తూ నవ్వింది.

*　　　*　　　*

"డాక్టరుగారూ, మీకు కొంత శ్రమ ఇవ్వదల్చుకున్నానీవేళ." కాత్యాయని వస్తూనే అంది రాజారావుతో.

"ఏవిటో?"

"మా చెల్లాయికి జ్వరం వస్తూందిప్పుడు. నాలుగు రోజులుగా వుంది. పొద్దున్న తగ్గడం సాయంత్రం రావడం. ఒకే టైముకి రావడం....వూరంతా టైఫాయిడ్ వుంది. అదే ఏమోనని భయంగా వుండీ...."

"అగండాగండి. మీరే నిర్ణయం చేసేయకండి చెట్టంత డాక్టర్ని ఎదురుగా పెట్టుకుని. ఇంతకీ నామీద పడిందేం కన్ను.... చుట్టపు చూపుగా వచ్చినవాడ్ని. మీ ఫామిలీ డాక్టరేమయ్యాడు?"

"మీమీద కన్నుపడిన మాట వాస్తవమే. మా సుశీ...."

"అయితే నిజమే నన్నమాట" వంగి, ఆమె కళ్ళలోకిచూస్తూ

తమాషాగా నవ్వాడు.

నివ్వెరబోయింది. అతని ముఖం కొత్తగావుంది. కొద్దిగా ఎర్రనయింది. కళ్ళల్లోంచి పలుభావాలు ఆమెను వెల్లువలా ముడుతు న్నట్లుంది. ఏదో చెప్పబోయి ఆగుతున్నట్లున్నాడు. ఒక్కక్షణం కాత్యా యనికి భయంలాంటిది కలిగింది. మరు నిమిషమే నిబ్బరించుకుని, కుర్చీలోంచి లేచింది కూర్చున్నదల్లా. అతనింత దగ్గరగా నిలబడి వంగి చూస్తున్నాడంటే, తను లేస్తే అతన్ని ఢీకొంటానని భయ పడింది. అలాగే కూర్చోవాలన్నా ఇబ్బందిగానే అన్పించింది. అంతలో పార్వతి వచ్చింది, "ఏమిటి కాత్యాయనీ, మీ చెల్లాయి సంగతేనా అడుగుతున్నావు?"

కాత్యాయనికి వచ్చినప్పటి ఉత్సాహంలేదు. పరధ్యాన్నంగా అంది. "ఔనత్తయ్యా, దానికి జ్వరం."

పార్వతి మరోలా అర్థం చేసుకుంది, "దానికే అలా దిగాలు పడతావేం. మా అల్లుడున్నాడుగా. ఓసారి చూపించు." అంది మురి పెంగా రాజారావుని చూసుకుంటూ. "అత్తయ్యకు సరదా తమ అల్లుడు డాక్టరని." కాత్యాయని చిలిపిగా నవ్వింది. రాజారావు నవ్వ లేదు. "ఎంతదూరం మీ యిల్లు."

"మీరు నడిచేంత దూరం."

"పదండమరి."

జోళ్ళు వేసుకున్నా రిద్దరూను. అప్పుడే బయటనుంచి లోపల కొస్తూ అడిగాడు ప్రకాశం. "ఎక్కడికీ, సుశీలేదీ?" అని. రోజూ ముగ్గురూ కలిపి వెళ్ళడం అలవాటు.

వెనకనుంచి పార్వతి అంది. "సుశీలకి తలనొప్పిగా వుందని పడుకుంది. వాళ్ళ చెల్లెలికి జ్వరంగా వుందంటే చూసిరమ్మని వెళ్ళ మన్నాను."

"అత్తగారి హోదా చూపించేస్తున్నావన్న మాట." రాజా రావు తల్లి వచ్చిందింతలో లోపలి గదిలోంచి.

"అన్నయ్యా, మేం వచ్చి అప్పుడే పదిరోజులయింది. సామెత చెప్పినట్టుగా వుంది. పిల్లని చూసుకోడానికివచ్చి, పది

రోజులు మకాం పెట్టేం. రేపు వెళతాం మరింక. ముహూర్తాలవీ చూపి, నువ్వే వుత్తరం రాయి."

కాత్యాయనీ, రాజారావులకి వినబడుతూనే వున్నాయి యీ మాటలు.

"అయితే రేపు వెళ్ళిపోతున్నారా?"

"ఆ! ఇంకెన్నాళ్ళు. అసలు ఇన్నాళ్ళు వుందామనుకోలేదు. మామయ్యా, అత్తయ్యా తెగ బలవంతం చేశారు. అయినా వుండక పోదు ననుకోండి. మీ వల్ల...." అంటూ ఆగాడు.

అప్రయత్నంగా అతని కళ్ళలోకి చూసింది. చప్పున చూపు మరల్చుతూ, "ఊ....నావల్ల...."

"మీవల్ల ఇన్నాళ్ళూ వున్నాను."

కాత్యాయనికి చిరాకు, కోపం పొంగాయి. "ఏమిటి మీ మాటలు రాజారావుగారూ?" అన్నది. కొద్దిగా కఠినమయింది స్వరం.

అతనేం మాట్లాడలేదు.

సిగ్గుపడింది. మృదువుగా నవ్వుతూ అంది. "సుశీలని వదలి వెళ్ళలేక అని చెప్పరేం. సిగ్గా."

అతనీసారి బదులు పలకలేదు. నిట్టూర్పు వినిపించింది. పక్కకి తిరిగి చూడాలనిపించినా, ముఖం తిప్పలేదు. ఇంటి వరకు మౌనంగా నడిచారు.

"ఎవరే కాత్యా. ఆయన?" మెల్లిగా అడిగింది సుభద్రమ్మ.

"అదేనమ్మా, సుశీలకి కాబోయే ఆయన. చెప్పానుగా డాక్టరు గారని."

"ఓహో. రండిబాబూ రండి" ఆదరంగా పిల్చింది.

"ఇదిగోనండీ" చూపించింది చెల్లెల్ని. చెల్లెలి మంచం పక్కకి కుర్చీవేసింది. అతను ఆ పిల్లనేమో అడుగుతున్నాడు. లోపలకెళ్ళింది. "అమ్మా, కాస్త కాఫీ."

"ఆ! ఆ! అదే పెడుతున్నాను."

రంగారావు, వెంకట్రావు వచ్చారింతలో. వారికికూడా పరిచయం చేసింది రాజారావుని.

"ఏమండోయ్, మా తమ్ముడు అడుగుతున్నాడు స్టెత్ లేని డాక్టరేమిటని?" అంతా నవ్వారు.

"మా బృందావన్ గార్డెన్స్ చూస్తారా."

"ఏమిటది?"

"ఇదేనండీ! మా పెరటితోట."

"సరే చూపించండి."

"ఇంతకీ యేమిటంటారు జ్వరం? అమ్మకి టైఫాయిడ్ లాంటి మాటలు చెవినబడితే భయం. అందుకే మిమ్మల్ని యేమాటా చెప్పక యిలా తీసికొచ్చాను. లేకపోతే మూడుగదుల మా యిల్లు మహారాజా పేలస్సు, ఈ ఆనప పొట్ల పాదులు బృందావన్ గార్డెన్సా? మీ డయాగ్నొసిస్ యేమిటో ఇక్కడే చెప్పండి మహానుభావా." పెరటి గోడదగ్గర మందారచెట్టుకింద నిలబడి అడిగింది. పెరడు చూపిస్తోం దనుకుంటున్నారు యింట్లో అంతా. "మెరికలాగున్నాడు కుర్రాడు. కాత్యాయని అతనిప్రక్కన నిలబడితే .... ఎంత బాగుంది జోడీ" ఇంట్లో అంతా అనుకుని నిట్టూర్పు విడిచారు.

అటు, ఇటుచూసి, మందార కొమ్మమీద చేయివేసి ఆమె వేపేచూస్తూ, మెల్లిగా చెప్పాడు రాజారావు.

"మీతో యేకాంతంగా మాట్లాడే అవకాశం నాకు దొరకదు. అందుకే ఇలాటిచోట, ఈ పరిస్థితిలో చెప్పేస్తున్నాను. ఉత్తరాలు రాసి యివ్వటం నాకు బాగులేదు. అందుకే యిలా....మీరు నాకు బాగా నచ్చారు. మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటా నంటే మీరేం చెప్తారు?"

తెల్లబోయింది కాత్యాయని. ఇతని చూపులు యీ సంగతి చెప్పకనే చెబుతున్నాయి యిన్నాళ్ళబట్టీను. కాని యింత ధైర్యం చేస్తాడని అనుకోలేదు. ఏం చెప్పడం? అసలేమిటీ విచిత్ర పరిస్థితి. నిలకడ లేనివాడిలా వున్నాడే. సుశీల సంగతేమిటి? అయోమయంగా క్షణం నిలబడి పోయింది.

ఇంట్లో వాళ్ళంతా తమవేపు విచిత్రంగా చూడడంతో తమా యించుకుని "రండి. ఇంట్లోకి వెళదాం. ఇంతకీ మా చెల్లి...."

"టైఫాయిడ్ లక్షణాలే కనబడుతున్నాయి. నా ప్రశ్నకు

జవాబు?"

"చెప్తాను తరవాత."

"ఎప్పుడు?"

"రేపు."

"ఎక్కడ?"

"పార్కులో."

తమ్ముడు తమ వేపు రావడంతో ఆపేసింది.

*  *  *

"మీ కోసం ప్రయాణాన్ని రేపటికి వాయిదా వేసుకున్నాను," క్రింద రుమాలు పరచి కూర్చుంటూ అన్నాడు.

"గొప్ప పని చేశారు." గడ్డిమొక్కలు పీకుతూ అంది.

"ఊ. చెప్పండి." ఆమె వేళ్ళ కదలికనుచూస్తూ అడిగాడు.

"సుశీల మీకెందుకు నచ్చలేదు?" వుండి వుండి హఠాత్తుగా అడిగింది.

నవ్వాడతను. "నాకు ముద్దబంతి యిష్టంలేదు. సన్నజాజి యిష్టం. బంతి యెందుకిష్టంలేదు అంటే నేనేం కారణము చెప్పగలను?"

"ఇలాంటి సమాధానం నాకు తృప్తిగాలేదు."

"అసలు మీకు తృప్తినిచ్చే సమాధానం నేనెందుకివ్వాలి?"

"మీరు చంచల స్వభావులేమో అని అనుమానం నాకు. అది తేల్చుకుందుకే...."

"చూడండీ! సుశీలని నేను చిన్ననాడు యెప్పుడో చూశాను. మళ్లీ ఇదే చూడ్డం. చూడగానే కొంత అసంతృప్తి ఫీలయ్యాను. కాని మామయ్యమీద, మా బంధుత్వంమీద గౌరవంతో ఆమెను చేసుకుందామా అనే అనుకున్నాను. నాకు అమ్మతప్ప మరెవరూ లేరు. బంధువులని పేరుచెప్తే వీరే."

"మరి...."

"అదే చెప్తున్నా. నేను వచ్చిన మర్నాడే మీరు మామయ్యా గారింటికి వచ్చారు. మీ స్వరం వినడంతోనే నాకెందుకో....యెంతో

తెలిసిన వారిలా చాలా దగ్గిరవారిలా అనిపించింది. గదిలోంచి యివ తలకి వస్తూనే....మిమ్మల్ని చూస్తూనే.... నేను.... ఒక...."

కిసుక్కున నవ్వింది. "ప్రథమ వీక్షణంలోనే ప్రేమ పుట్టిస్తుందంటారు."

"మీరు ఏమనుకున్నా సరే. నాకే తెలియకుండా నేను వో రూపాన్ని యేర్పరచుకుని వుంటాను. దానికీ మీకూ దగ్గిర పోలికలు కనిపించి వుంటాయి. అందుకే....ఈ నిర్ణయానికొచ్చాను."

"సారీ, మీ నిర్ణయాన్ని మార్చుకోండి."

దెబ్బతిన్నట్టు చూశాడు.

"కోపంవద్దు. ప్లీజ్."

"ఏం? నామీద యిష్టంలేదా?"

"సుశీల తరవాత నాకు మీరే మంచి ఫ్రెండ్. ఈ కొద్ది రోజులలోనే మీమీద మంచి అభిప్రాయం కలిగింది."

"అయితే స్నేహితురాలి కన్యాయం జరుగుతుందని భయమా?"

పకపక నవ్వింది కాత్యాయని.

"ఇప్పుడు జరగలేదా?"

"ఎలా?"

"నేను మిమ్మల్ని చేసుకోబోయేది యెలాగాలేదు. సుశీలని చేసుకుంటాడు మీరు. కాని మీ వూహల్లో బొమ్మని నేనని చెబుతున్నారు. దీన్నిబట్టి...."

చటుక్కున ఆమెచేయి పట్టుకుని "ఎందుకు? ఎందుకు మీరు నన్ను నిరాకరిస్తున్నారు? మనసు విప్పి చెప్పకూడదా కారణం?"

"నాకు పెళ్ళిమీద మనసులేదు."

"ప్రతి ఆడపిల్లా అలాగే అంటుంది" నవ్వాడు.

"అది సిగ్గుతో తల్లి తండ్రులదగ్గర, ఇరుగు పొరుగు అమ్మలక్కల దగ్గరాను బింకంతో అనే మాటలు. కానీ, మీలాంటి వరుడొచ్చి, నిన్ను చేసుకుంటానంటే....యిలా అనవలసిన పనేముంది?"

"మరెందుకిలా...."

"అది నిజం కనక. సిగ్గు, ఓడియం నాకు లేవు సుమండీ!"

"ఏం మాటలు బాబూ!" అని ఆగి ..."ఈ విషయం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. మీ ఆర్థిక పరిస్థితులు ఇలా అనిపిస్తున్నాయా.... అని...."

"డాక్టరుగారూ! అందులో కొంత నిజం వున్నా, పూర్తిగా నిజం కాదు."

"కొంతేనా నిజం వుందని ఒప్పుకుంటారుగా...."

"ఆ! మా చిన్నన్న చదువుంది. చెల్లి, తమ్ముడు వున్నారు. వాళ్ళని విద్యావంతుల్ని చెయ్యాలి. నా లక్ష్యం అదే."

"జీవితమంతా ఎలా గడుపుదామని?"

"నాకో లక్ష్యం వుంది. పుస్తకాలు నా స్నేహితులు. మీరూ....మామయ్యగారూ....ఇలాంటి స్నేహితులూ వున్నారు. కాలమే గడపదా? చిన్న చెల్లాయికి సంగీతం చెప్పిస్తున్నాం. ఎంత గొప్ప కంఠం అనుకున్నారూ! అది బాగా వృద్ధిలోకి వచ్చి, కచేరీలు చేసే రోజున...."

"అబ్బ! కాత్యాయనీ! యెంత చమత్కారంగా మాట తప్పిస్తున్నారు?"

"ఔనా!" అని నవ్వి కాసేపు మౌనంగా వుండిపోయింది. "రాజారావుగారూ! నేనిలా ఒకరిదగ్గర మనసు విప్పి నా విషయం చెప్తానని అనుకోలేదు. మీ రెందుకో నన్ను అభిమానించి, ఓ విధంగా దగ్గరయ్యారు. నిజం చెప్తున్నా మిమ్మల్ని మంచి స్నేహితుడిగా అభిమానించగలను. స్నేహితురాలి భర్తగా మీ బాగు నాకు కావాలి. మీ ఉన్నతి నాకు కావాలి. డాక్టరుగా మీ ఆశయాలు, ఆదర్శాలు నెరవేరితే నా కంతకన్న సంతోషం వుండదు. కాని....మిమ్మల్ని భర్తగా ....వూహించలేను."

"కారణం? సుశీలా?"

"మళ్ళీ అడుగుతున్నారు మీరు. స్నేహితురాలి కోసమంటూ మిమ్మల్ని త్యాగం చేయమని అడగను. ఒకవేళ మిమ్మల్ని వరించి వున్నట్లయితే, అటువంటి త్యాగాలు అర్థంలేనివి. నిర్మోహమాటంగా

చెప్తున్నా ననుకోకండి."

ఆశ్చర్యంగా చూశాడామెవైపు.

"ఔను. నామీద కాకపోతే మరెవరిమీదైనా సరే మనసు వుంచుకుని సుశీల కేం న్యాయం చేస్తారు మీరు? అటువంటి వంచన సహించలేను."

"మరిప్పుడు....మీరు కాదంటున్నారు....కనక జరిగేది అదే కదా!"

"కావచ్చు! దానికి నా బాధ్యత ఏమీలేదు. నేనేం చెప్పలేని విషయంలో!"

"సరే మీ విషయం?"

"నాకు సెక్స్ జీవితమంటే అసహ్యం."

అదిరిపడ్డాడు రాజారావు.

"ఏం మాట్లాడుతున్నారు? ఈ మాట ఎవరేనా వింటే ఏమను కుంటారు తెలుసునా? వయసులో వుండీ...."

"ఔను. ఏమనుకుంటారో నాకు తెలుసు. కాని. నేను చెప్పే దేమిటంటే....నా కెందుకో అది తల్చుకుంటే రోత. అసహ్యం. చాలా చికాగ్గా వుంటుంది. దానికి కారణం బహుశా...."

"ఊ! బహుశా...."

తన చిన్ననాడు మేడమీద యింటిగలాయన ప్రవర్తన సింహాచలం గుడిసెలో తను చూసిన దృశ్యం అన్నీ చెప్పింది.

"ఇటువంటి సంఘటన సెక్స్‌మీద కుతూహలం రేపి. ఆసక్తి కలిగిస్తాయంటారు. కాని నా కెందుకో తల్చుకుంటేనే...."

"ఇంత తెలుసుండీ....ఆలోచించగలిగీ....యింకా పొరపాటు పడుతూనే వున్నారు. ప్రేమ ఎంత మనసుకి సంబంధించినదే అయినా, ఈ సంబంధం దాన్ని మరింత దృఢతరం చేస్తుంది. ఒక విధంగా చెప్పాలంటే పరిపూర్ణత కలుగుతుంది."

"మీరు చెప్పింది నిజమే కావచ్చు. కానీ. నా కెందుకో విము ఖత తగ్గటంలేదు. అయినా మరోటి....ముందుముందు నాలో మార్పు రావచ్చునేమో కూడా. అలాంటి మార్పు నాలో కలిగించేవాడూ,

నన్ను కదిలించేవాడూ తటస్థపడితే....తప్పక పెళ్ళి చేసుకుంటాను ఆ స్పందన నాలో కలిగిన రోజున."

"ఆ స్పందన నేను కలిగించలేకపోయనా?"

"ఈ ప్రశ్నకి జవాబు కఠినంగా వుంటుంది. ఎందుకు నాచేత పలికిస్తారు?"

ఛెళ్ళున కొట్టినట్టయింది రాజారావుకి. కొద్దిగా కోపం కూడా వచ్చింది.

అవమానించబడ్డట్టుగా తోచింది. మరింత కోపం వచ్చింది. రోషంగా చూస్తూ అన్నాడు, "దీన్నే అంటారు అదృష్టం అందలం ఎక్కిస్తే...."

"రాజారావుగారూ!" గట్టిగా పిల్చింది కాత్యాయని.

"మా పరిస్థితులు చూపి మా కుపకారంచేసి పుణ్యం కట్టుకుందామనుకున్నారా?"

ఆమె కోపంతో ఎర్రబడింది. తీక్షణంగా చూస్తూ క్రోధాన్ని అణుచుకుంటూ అడిగింది. ఆ అడిగిన తీరుకి నిర్ఘాంతపోయాడు. ఆ వాడిచూపు వేడిగా, పొగలు, సెగలు కక్కుంది. మంచులా ఆవరించిన మూర్ఖత జారిపోయింది.

సిగ్గుపడిపోయాడు. ఆ ముఖం చూస్తూ అంత మాట తనెలా అనగలిగాడు?!

"నన్ను క్షమించు....క్షమించు కాత్యాయనీ...."

"మగబుద్ధి పోనిచ్చుకున్నారుగాదు" లేచి నిలబడింది.

భయపడుతూ "నన్ను మన్నించు. వెరీ వెరీ సారీ! ఏదో తిక్క రేగింది బుర్రలో. మొదట్నుంచీ ఎందుకో నామీద నీ ఆధిత్యం చూపిస్తూ వున్నావు. అదే....పట్టలేక...."

కోపం మరిచి, పకపకనవ్వింది.

"అదే మగబుద్ధి అన్నాను. సరే! అయిందేదో అయింది! పదండి. మన స్నేహాన్ని స్నేహం లాగే వుంచితే సంతోషిస్తాను...."

"ఒక్కమాట కాత్యాయనీ!" తనూ లేస్తూ అన్నాడు.

"మీవాళ్ళ కోసం మాత్రం నువ్వు త్యాగం చేయటంలేదా? సారీ ...మీరు...."

"ఫరవాలేదులెండి నువ్వు అన్నా ఫరవాలేదు. మనం ఇప్పుడు మంచి స్నేహితులం కూడాను. అవునా. మా వాళ్లకోసం త్యాగం అంటారా? నాకలా అనిపించటం లేదు. వాళ్ల అమాయకపు ముఖాలు చూసినపుడల్లా వీళ్ల భవిష్యత్తుకి ఏం చేయకలుగుతానా ఏదెన్నా చేసే తీరాలి....అనే ఆవేశం కలుగుతుంటుంది. ఒకవేళ నేను వివాహం చేసుకున్నా కూడా నా వాళ్లకి నా సహాయం అవసరమైనంత వరకూ వుంటూనే వుంటుంది. ఆ కండిషన్‌కి ఒప్పుకుంటేనే నండోయ్ పెళ్ళి!"

"మీ షరతులన్నీ ఒప్పుకునేవాడు రావద్దూ."

"రాకపోతే మునిగిపోయిందేమీ లేదు లెద్దురూ! అయినా ప్రపంచంలో ఇంతమంది పెళ్ళిళ్లు చేసుకుంటున్నారు నేనొక్కదాన్ని చేసుకోకపోతే మునిగిపోయిందేమిటి చెప్పండి?"

"తోడు అనేది చాలా అవసరం మనిషికి. ఇప్పుడు కాకపోతే కొన్నాళ్లకయినా ఆ వెలితి మీకు కనబడుతుంది."

"సరేగానీ నేనో మాట అడగనా?"

"తప్పకుండాను. మా సందు దగ్గర పడుతున్నాం. నన్ను కాదని నిర్దయగా నిరాకరించేరు. సరే! మర్చిపోను మిమ్మల్నెప్పుడూ. జీవితంలో నా సహాయం మీకేనాడైనా కావలిస్తే నిస్సంకోచంగా అడగండి."

మ్లానమైన ముఖంతో, తలవంచుకుని నడుస్తూ చూపులు తిన్నగా రోడ్డుమీదే పోనిస్తూ చెప్పాడు.

"నేను డాక్టర్ని కాలేకపోయినా....నర్సు నవుదామని అనుకుంటున్నాను. నాన్నగారు రిటైరయ్యేనాటికి నేనో ఉద్యోగంలో స్థిరపడాలి. ట్రెయినింగ్‌కి వెళతాను. వచ్చాకా...."

"ఊ, వచ్చాకా?"

"మీ హాస్పిటల్‌లో నన్ను చేర్చుకుంటారా? అదే పేషెంటుగా కాదు సుమండీ నర్సుగా ఉద్యోగమిస్తారా అని."

"కాత్యాయనీ....అంతకంటే అదృష్టమేముంది. కనీసం ఆ అదృష్టాన్నయినా నాకు కలిగించు."

"పొగిడే మాట వొద్దు సార్. అలాంటి పల్లెల్లో వుండాలని నా కోరిక. ఉద్యోగం, నా పుస్తక పఠనం....మరో వ్యాపకంవుండ కూడదు. అందుకే అడుగుతున్నా."

"తప్పకుండా. జనానికి వీలయినంత మంచి చేయాలనే నా ఆశయం కూడాను. మీ సహకారంకూడా వుంటే....నాకెంతో బలంగా వుంటుంది కూడాను."

"ఇక వెళ్ళిరానా...." ఆమె అడిగింది, నవ్వుతూ.

బాధగా చూశాడు, "చాలా కష్టంగావుంది కాత్యాయనీ నాకు. ఎందుకిలాంటి...."

"ప్లీజ్, అలా దేవదాసు ఫోజు పెట్టవద్దు. నాకిష్టం వుండదు. టేకిట్ ఈజీ. స్నేహంలో వున్నంత మాధుర్యం దేనిలోవుంది చెప్పండి. సుశీలకీ సంగతేం చెప్పకండి యేనాడూ కూడా. అనవసరం. వస్తానూ...."

* * *

"సుశీలా!"

"ఏయ్! కాత్యా నువ్వా! యెప్పుడొచ్చావు? ఇలా సడెన్‌గా వచ్చేవేమిటి? నీ నర్స్ ట్రెయినింగ్ పూర్తయినట్లేనా?" కాత్యాయని రెండు చేతులు పట్టుకుని ఆప్యాయంగా అడిగింది. "కూర్చోవే యిలా! మంగమ్మా కాఫీ పట్రా!"

"కాఫీకి తొందర్లేదుగాని చెప్పు....యెలా వుంది పల్లె జీవితం."

"నా ముఖంలా వుంది. బోర్‌కొట్టి చస్తున్నాననుకో. ఎవరూ మాట్లాడేందుకు కూడా వుండరు. ఓ సినిమానా, క్లబ్బా! ఏదీ లేదు. పరమ చాదస్తులు జనం. వాళ్ళ ఆచారాలేంటో పద్ధతులేంటో....తల, తోక కనిపించవనుకో."

రాజారావు వచ్చాడు లోపల్నుంచి, 'ఎవ....ఓ.... కాత్యాయనీ! వచ్చేశారా' అన్నాడు సంతోషంగా.

"ముందు ముఖం తుడుచుకోండి అలా ఆగిపోయారేమిటి ఓ చేత్తో టవలు పట్టుకుని." అని నవ్వింది సుశీల.

ఎదురుగా కూర్చుంటూ అన్నాడు. "ఏమిటండీ చెప్తోంది మీ స్నేహితురాలు? ఈ వూరి వాళ్ళని, నన్ను కలిపి తిడ్తోందా?"

"మొదటి భాగం పూర్తయింది. రెండోదింకా మొదలెట్టలేదు" చిలిపిగా నవ్వింది కాత్యాయని.

*   *   *

"పదండి హాస్పిటల్ చూపిస్తాను. ఇల్లూ హాస్పిటలూ ఒకటే ననుకోండి. ప్రస్తుతానికి ఆరు బెడ్సు వున్నాయి. ఒక నర్సు, కాంపౌండర్ వున్నారు. మీతో యిద్దరు."

"ఏమిటి? కాత్యాయని .. ఇక్కడ...." సుశీల ఆశ్చర్యంగా అడిగింది.

"అవునే సుశీలా! నిన్ను వదలలేక నీతోపాటే వచ్చేశా నీ వూరు."

"ముందే వుత్తరం రాశావేమిటి ఆయనకి. నాకు చెప్పనే లేదు?" సుశీల స్వరంలో ఆశ్చర్యంపోలేదు.

"ఉత్తరం రాయటంకాదు సుశీ, అప్పుడీయన మీ వూరు వచ్చి అదే మనవూరు వచ్చినప్పుడు మాటల సందర్భంలో చెప్పాలే! మీరు హాస్పిటల్ పెడితే నేను నర్సుగా వచ్చి చేరుతానని."

సుశీల ముఖంలో కాంతి మందగించింది. 'మొదటి నుంచీ కాత్యాయనంటే ఈయనకి కుతూహలం ఎక్కువగానే వుంది. తనని చూసుకోడానికొచ్చినప్పుడే ఆమెను ఆరాధనగా చూసేవారు. కాని తరువాత ఆ సంగతి అట్టే పట్టించుకోలేదు తను కాత్యాయని స్వభావం తెలుసు గనుక. మాటొచ్చినప్పుడల్లా ఆయన దానిని పొగుడుతూనే వుంటారు. అప్పుడప్పుడు తనకి అసూయగా అనిపించినా సర్దుకునేది. దాని చలాకీతనం వల్ల అలా అందర్నీ ఆకట్టుకోడం సహజమే అనుకునేది. కాని....కాని....ఇప్పుడు దీన్ని చూడగానే....ఆయన కళ్ళలో ఎంత సంతోషం! ముఖం తుడుచుకోడం కూడా మర్చిపోయి చూస్తూ వుండిపోయారు. అసలు వీళ్ళిద్దరూ ఈ

సంగతి యెప్పుడు మాట్లాడుకున్నారో? తన ముందు ఇలాంటి సంభాషణ జరిగినట్టు గుర్తు లేదే? సుశీల ఆలోచనలు ఎటో పరుగులు తీస్తున్నాయి.

* * *

కాత్యాయనికి అట్టే పని లేదు. వచ్చి ఆరు నెలలవుతోంది. నాలుగు ఆపరేషన్లు చేశాడు రాజారావు. అన్నీ సక్సెస్ అయ్యాయి.

కాత్యాయని ఇన్నాళ్లు సుశీల దగ్గరే వుంటోంది. నిన్న ఓ ఆపరేషన్ చేసి బయటకి వచ్చాక రాజారావు పిలిచాడు ఎందుకో కంగారుగాను. "ఏం డాక్టర్! పేషంట్ కడుపులో కత్తెర గట్రా మర్చిపోయారేమిటి?" అంది తను వస్తూ. నవ్వుకున్నా రిద్దరూను. వంటమనిషి మంగమ్మ వచ్చింది ఆ పక్క కెందుకో. చురచుర చూస్తూ వెళ్ళిపోయింది. హాస్పిటల్‌లో ఏం పని దీనికి? అడుగుదామనుకునే లోగానే వెళ్ళిపోయింది.

కాత్యాయని తలంటుకున్న జుట్టును ఆరబెట్టుకుంటూ ఫాన్ క్రింద నిలబడింది. ఆరోజు ఆదివారం. రాజారావు యింకా నిద్ర నుండి లేవలేదు.

"ఇదిగోనమ్మా! కాఫీ" వంట మనిషి విసురుగా అక్కడున్న స్టూలుమీద పెట్టి వెళ్ళిపోయింది.

'ఏమిటి? దీనికింత కోపం నామీద' సాలోచనగా అటే చూస్తున్న కాత్యాయనికి శటుక్కున ఆలోచన తట్టింది. బహూశా సుశీల కుటుంబంతోపాటు తనకీ చేసిపెడ్తోందని కాబోలు. దానికోసం తను ప్రత్యేకంగా జీతం యివ్వాలనేమో! ఇస్తేసరి! ఏం పోయింది? ఇన్నాళ్ళూ అంత గమనించలేదు. ఆలోచిస్తూ వున్న కాత్యాయనిని గమనిస్తూ నిలబడింది సుశీల.

"ఓ సుశీ! లేచావా! నా తలస్నానం అయిపోయింది అప్పుడే."

అదోలా చూస్తూ నిలబడింది సుశీల. ఉలిక్కిపడింది కాత్యాయని.

"సుశీలా! వంటమనిషి ఎందుకో నన్ను చూస్తూనే రుసరుసలాడుతోంది. తనకి నేను వేరే జీతం యిస్తానని చెప్పు."

"సరేలే!" నీరసంగా అనేసి, వూరుకుంది.

"సుశీ!"

"ఊ!"

"ఎందు కలా వున్నావు. నేను మీ యింట్లో వుండడం మీకు ఇబ్బందిగా వుంటోందా? దగ్గరగా వుంటే నీకు, డాక్టరుగారికి కూడా సహాయపడతాననే ఇక్కడ వుంటున్నాను. వున్నందుకు డబ్బు రూపంలో యిస్తే, నువ్వేమైనా అనుకుంటావని, ఇంటికేదైనా ఆర్టికల్ కొని తెద్దామన్న వూహలో వున్నాను. నీలో ఏదో మార్పు కనిపిస్తోంది. ప్రస్తుతం... ఈ మూడో నెలలో యిలా వుండడం గర్భిణి స్త్రీలకి సహజమే గాని....అదికాదు. ఇంకా....భిన్నంగా ఉంది నీ ప్రవర్తన."

"గమనించావన్నమాట."

"ఔను. ఎప్పటికప్పుడు అడుగుదామనుకుంటూనే వాయిదా వేశాను."

"చూడు కాత్యాయనీ... చిన్ననాటినుండీ నువ్వు నా స్నేహితురాలివి. నీ గురించి నాకు బాగా తెలుసు. అయినా....కొందరు చెప్పే మాటలు, మావారి ప్రవర్తన చూస్తుంటే నాకు....కొంత బాధగానే వుంటోంది. అందుకే అడుగుతున్నాను. మా వారిని మావారికి.... నువ్వు....నువ్వు... అసలు మీ యిద్దరి మధ్య...."

"సుశీలా!" కోపంగా అరచినంతపని చేసింది కాత్యాయని. "పూర్తిగా మాట చెప్పలేకపోతున్నావు. నీ నోట అది పలకడానికే సిగ్గుపడుతున్నావు. అటువంటి దానివి నన్నెలా అనుమానించగలుగుతున్నావు? ఒకవేళ మీవారు తప్పుగా నడిచినా నేను యెలాంటిదాన్నో నీకు తెలియదా? అలా కాక, మీవారి మీద నాకే మనసైతే, నువ్వు అడ్డమని నేను వూరుకుంటానా? చూడు సుశీలా....నీకు తగినంత పని లేక....ఇలా బుర్ర పాడుచేసుకుంటున్నావు. పని చేస్తున్నప్పుడు మూతి ముడుచుకుని వుండలేంకదా! అందుకే ఆ రోగులు యెంత వద్దనుకున్నా, విసిగింకేస్తారు వాళ్ళ ప్రశ్నలతో. ఏవో జోక్స్ వేసి నవ్వుకుంటుంటాం దానికే....మీ మంగమ్మ...."

"ఇది పల్లెటూరు కాత్యాయనీ ...వాళ్ళు...."

"వాళ్ళలా అనుకుంటారన్నది సరే. నువ్వు....నువ్వు చెప్పు నన్ను అనుమానిస్తావా చెప్పు...." దగ్గరగా వెళ్ళి, సుశీల రెండు భుజాల మీద చేతులు వేసి ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగింది. విరబోసుకున్న జుట్టు గాలికి అటు యిటు కదులుతోంది. ముఖాన యెర్రని తిలకం జ్యోతిలా వుంది. కళ్ళలో నిర్భయత్వం, నైర్మల్యం. అలా క్షణం చూపిన సుశీలకి ఆమె స్ఫటికంలా కనబడింది. తనలో తనే కుంచించుకుపోయింది.

"కాత్యాయనీ" అంది ఆమె భుజంమీద తల ఆన్చి. "ఏమిటో పిచ్చి....పిచ్చి వూహాలన్నీ బుర్రలో దూరాయి." కాత్యాయని నవ్వేసింది. సుశీల బుగ్గమీద చిటికేసి.

"అందుకే .... అందుకే .... పిల్లా....బుర్రకి పని కల్పించమంటున్నాను. వయోజన పాఠశాల ఒకటి పెట్టి వీళ్ళకి చదువుచెప్పు. ముందు మీ మంగమ్మ సందులో చేర్చు."

"ఏమిటండోయ్, నా మాట వచ్చిందీ ..." అంటూ వచ్చింది మంగమ్మ.

"ఏం లేదు మంగమ్మగారూ, మీరు వండిపెట్టలేరని నేను వేరే గది తీసుకుంటున్నాను. ఇన్నాళ్లూ చేసినందుకు మీకు చాలా థాంక్స్ అంటున్నాను. మీకు ఆరు నెల్లకీ జీతం యెంతో చెప్తే యిచ్చేస్తాను."

"కాత్యా...." గాభరాగా పిలిచింది సుశీల.

"నువ్వు అడ్డు చెప్పకు సుశీలా। నీకు తెలుసుగా। నేనువినను. హాస్పిటల్‌కి దగ్గరగా యిల్లు తీసుకుంటా. ఎలాగా అమ్మావాళ్ళని తీసుకొద్దామనుకుంటున్నాలే. యెంత స్నేహమయితేమాత్రం యిలా నీ దగ్గర వుండడం...."

"నా మీద కోపం వచ్చిందనుకుంటాను."

"ఎంతమాత్రం లేదు సుశీలా। ఓ విధంగా నాకు పాఠం చెప్పావు. ఒక సంగతి మాత్రం చెప్తున్నాను. మీ డాక్టరుగారినే కాదు యెవరినైనా సరే నేను మనస్ఫూర్తిగా కోరుకున్నట్టయితే ....యెవరూ

నన్నాపలేరు. ఆ సంగతి గుర్తుంచుకో!"

సూర్యకిరణం చురుక్కుమన్నట్లు, స్వచ్ఛమైన గంగ ధారా ప్రవాహంలాగా జలజల పారినట్లు అనిపించింది ఆమె మాట.

సుశీల ఆలోచిస్తూ కూర్చుంది. కాత్యా ...కాత్యా నేను నీకేం చేయగలను? నీకేమీ వుపకారం చేయలేనా? నువ్వు కూడా జీవితంలో సెటిల్ అవాలంటే నేనేం చేయలేనా?

స్నేహితురాలిమీద మమత పొంగింది ఒక్కసారిగా.

"సుశీలా! ఆలోచన చాలించుగానీ....ఇవాళ నేను అమ్మనీ వాళ్ళనీ చూడ్డానికెళ్తున్నాను. తొమ్మిది గంటలకి బస్సుంది. హాయిగా రాజమార్గంలో నడిచి వెళతాను సుమా బస్టాండ్‌కి. దగ్గర కదాని ఆ మురికి సందుల్లోంచి వెళ్ళను. షార్టుకట్ అంటూ అటువేపు పోతూ వుంటారు అందరూను. నాకేం లేటయితే అయింది, చక్కని రాజమార్గం వుండగా...." కూని రాగం తీస్తూ, నవ్వుతూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది కాత్యాయని ప్రయాణానికి సిద్ధమవుతూ.

* * *

"అమ్మా" కాత్యాయని రిక్షా దిగుతూనే కేకేసింది. తల్లి పలక లేదు, సరికదా అక్క వచ్చిందంటూ చుట్టుముట్టే పిల్లలూ రాలేదు. 'ఏమిటా' అనుకుంటూ లోపలికడుగుపెట్టిన కాత్యాయనికి, ఓ మూల మంచంమీద నీరసంగా పడుకునివున్న తల్లి, తలమీద రెండు చేతులూ పెట్టుకుని కూలబడిన తండ్రీ, బిక్కమొహాలేసుకు చూస్తూ నిల్చున్న పిల్లలు కనిపించి గుండె గుభేలుమంది.

"అమ్మా! ఏమిటి? ఏమయింది? అలా వున్నారేం? ఒంట్లో బాగులేదా?" గబగబా చేతిలో సంచీ వదిలేసి తల్లి పక్కన మంచం మీద కూర్చుంది.

సుభద్రమ్మ ఏం మాట్లాడలేదు, కళ్ళు తుడుచుకుంది. ఓమారు నిట్టూర్చి భర్తకేసి చూసింది. వెంకట్రావు "అమ్మకి జ్వరం" అన్నాడు పొడిగా. తల్లినీ, తండ్రిని మార్చిమార్చి చూసింది. అది కాదు ఇంకా ఏదో వుందనిపించింది. ఇంకా అలా ప్రశ్నార్థకంగానే చూస్తూ వుండిపోయింది. "ఊ" అంటూ సుభద్రమ్మ అటుతిరిగింది.

"ఏమిటమ్మా? ఏమయింది? ఎప్పట్నుంచి జ్వరం"

వెంకట్రావు హఠాత్తుగా లేచి నిలడి, పెద్దగా అరిచినట్లుగా అన్నాడు. "ఆ వెధవ అలా భ్రష్టు అయినప్పటినుంచీను." అని విసురుగా ముందుకి నడిచివచ్చి, మళ్ళీ వెనక్కి వచ్చి, కాత్యాయని దగ్గరగా నిలబడి బాధ, కోపం నిండిన స్వరంతో అన్నాడు. "మీ అమ్మకి కాస్త ధైర్యం చెప్పు. ఇంతలో యేం కొంప మునగలేదులే. ఏడ్చి ఆరోగ్యం పాడుచేసుకోవద్దని చెప్పు."

సుభద్రమ్మ చటుక్కున ఏడవడం మొదలెట్టింది.

"ఏమిటమ్మా! ఏమయిందసలు? ఏం చెప్పరేం? ఏవర్రా! ఏమిటి? మీరైనా చెప్పండి?" గాభరాగా అడిగింది కాత్యాయని పిల్లల వైపు చూస్తూ. ముగ్గురూ కోరస్‌గా పలికారు. "మరేం అన్నయ్య పెళ్ళి చేసుకున్నాడు."

"ఆ!" నిర్ఘాంతపోయి చూస్తుండిపోయింది కాత్యాయని. ఇదేమిటి? ఎప్పుడు? ఎలా? ఎవర్ని? అయోమయంగా చూస్తూ వుండిపోయింది ఏడుస్తున్న తల్లిని.

మధ్య మధ్య కళ్ళు తుడుచుకుంటూ చెప్పటం మొదలెట్టింది సుభద్రమ్మ. "ఏం చెప్పనే కాత్యా! వాడొట్టి వెర్రిబాగుల వెధవే? ఎలా ఈ ఉచ్చులోపడ్డాడో తెలియకుండా వుందే!"

ముఖం చిట్లించింది కాత్యాయని.

"ఎలాగోలా అవస్థలుపడి అటెండర్‌నుంచి మెల్లిగా ఆ టైపిస్ట్ వుద్యోగం సంపాదించుకున్నాడా! అదిగో....అప్పట్నుంచే వాళ్ళకి వీడుమీద కన్నుపడింది."

"ఎవరికి?"

"అదేనే! వీడి ఆఫీసులోనే వ్యూనట ఆ ముసలి వెధవ. ఎనాళ్ళబట్టో ఆ కంపెనీలో వుంటున్నాట్టగా. వీడిని అప్పుడప్పుడు వాళ్ళింటికి రమ్మని పిలిచేవాట్ట. ఈ వెధవకి బుద్ధుండొద్దు చెప్పూ. ఆ గుడిసెల్లోకి వీడెందుకు దూరడం? వీడప్పుడప్పుడు ఆలశ్యంగా వస్తుంటే ఎక్కడో తిరిగొస్తున్నాడనుకొనేదాన్ని. ఇలా ఆ పిల్ల ముండ వల్లో పడతాడనుకోలేదు."

అర్థమయింది కాత్యాయనికి. ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరి అవుతూ మౌనంగా వుండిపోయింది.

"కూతురు పెళ్ళీడుకొచ్చింది. కాని డబ్బులేదు చేతిలో. మన వాడు తేరగా దొరికాడు. వీడూ దాని సోకులకి మురిసిపోయినట్టున్నాడు. ఇద్దర్నీ వంటరిగా వదిలి పిల్లల్ని తీసుకొని యెటో పోయే వాడట."

"మరి ఆ పిల్ల తల్లి?"

"తల్లి లేదుట. ఆఖరిపిల్లకి ఆరేళ్ళు. దాన్ని కని చచ్చిందట. అంతా ఈ పెద్దపిల్లే చూసుకోేదంట."

"ఎప్పుడు పెళ్ళి....చేసుకున్నాడు?" ఈ మాట అడగడానికి గొంతులో ఏదో అడ్డు పడినట్లయింది.

"ఛీ! వాడూ....వాడి పెళ్ళీను. గుళ్ళో పెళ్ళిచేసుకుని తిన్నగా ఇంటికొచ్చాడు. ఏ మెరగనట్టు కాళ్ళకి దణ్ణాలు అది. పదోక్లాసు చదివిందట, బుద్ధిలేని గాడిద. సిగ్గెలా లేకపోయిందో?....అసలు లే సిగ్గున్నదయితే ఇంత నాటకమాడుతుందా?" కసిగా అంది.

కాత్యాయని అడిగింది అప్రయత్నంగా, "మన కులంకాదా!"

"అయ్యో! అలా అయితే ఇంత ఏడుపెందుకే?"

ఆలోచిస్తూ కూర్చుండిపోయింది కాత్యాయని. ఎందుకిలా జరిగింది? అమాయకంగా, ఏమీ తెలియనట్టుండే అన్నయ్య ఎలా ఇంత ధైర్యం చేయగలిగాడు? చేస్తే చేసేడు, అమ్మని ఓదార్చి ధైర్యం చెప్పి, తనున్నానన్న ధైర్యం యివ్వనక్కరలేదా! ఈ మధ్యనే ఆ టైప్ పరీక్షలు పాసయి, ఆ వుద్యోగం సంపాదించుకున్నాడు. అంతలోకే ఈ పెళ్ళి? అమ్మ నాన్నలకి తనేం ఆసరా అవుతాడింక. ఎంత అనాలోచితంగా చేస్తారు పనులు?

"అమ్మా! నువ్విలా ఏడవడమెందుకే? ఏడ్చి ఏం సాధిస్తావు? వాడి కిష్టమైన దాన్నేదో చేసుకున్నాడు. ఇంక ఆ సంగతి మరచిపోవడం మంచిది."

"వాడికిష్టమైనదో, నష్టమైనదో, పరువుందో, వూడిందో.... అదంతా అలా వుంచి, ఇప్పుడీ ముగ్గురి భవిష్యత్తేమిటి? మీ నాన్న

రేపో ఎల్లుండో రిటైరవుతారు. వీడు తెచ్చే వందో, రెండొందలో, ఏదో కాస్త ఆసరాగా వుంటాడు కొడుకనుకుంటే ఇలా....” సుభద్రమ్మ కంఠం మరి పెగలలేదు. కాత్యాయనికి మనసంతా యెలాగో అయిపోయింది. చేదు తిన్నట్టు, కఠోరమైన శబ్దాలు చెవుల్లో మారు మోగుతున్నట్టు, వూపిరాడనట్టూ, భవిష్యత్తు అంధకార మయంగా కన్పిస్తూనూ. అంతా అర్థం కాకుండా అయోమయంగా అన్పిస్తోంది. ఎటుచూపినా ఆర్థికసమస్య. అన్న అన్యకులస్థురాలిని చేసుకున్నందుకు ఆచార పరాయణులయిన అమ్మ, నాన్నలు అంతగా బాధపడ్డం లేదు. ఆ బాధను మించిపోయింది ఆసరా లేదన్న బాధ.

* * *

“అన్నయ్యా!”

“నువ్వా కాత్యా! వస్తానుండు. ఆఫీసులో చెప్పేసి వస్తా” కంగారు పడుతూ సీటుదగ్గర్నుంచి లేచాడు రంగారావు.

“పద! అలా పార్కుకివెళ్ళి మాట్లాడుతుందాం!” లోపలచెప్పి వచ్చిన రంగారావుని పరీక్షగా చూస్తూ అంది. తలవంచుకున్నాడు రంగారావు. ఆఫీసు గుమ్మం దాటుతుంటే, ఓ వయసు మళ్ళిన వ్యక్తి తమని పరిశీలనగా చూడ్డం గమనించింది. చేతిలో ఏవో ఫైళ్ళతో లోపలకెళుతూ ఇటే చూస్తోన్నాడు. చటుక్కున గుర్తొచ్చింది కాత్యాయనికి. ఎంత ఆపుకుందామని ప్రయత్నించినా, ఆగక ఆమె నోటి నుంచి వ్యంగ్యంగా వెలువడింది మాట, “ఆయనే....మీ మామ గారా?” మరింత తలవంచేడు రంగారావు. అది చూసి చివుక్కుమంది కాత్యాయనికి. గబగబ ముందుకి నడిచింది. ‘అమ్మ నాన్నల దగ్గరే భయపడలేదు. దీన్ని చూసేసరికి ఎందుకో నోరెండిపోతోంది’ అను కున్నాడు రంగారావు. పార్కులో యెవరూ లేనిచోటు చూసి కూర్చున్నారిద్దరూను. గాంభీర్యం తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ అడిగాడు రంగారావు.

“ఎప్పుడొచ్చావు?”

“పొద్దున్నే!”

క్షణం తటపటాయించి అడిగాడు. “అమ్మ ఎలావుంది?”

బుస్సున కోపం పొంగింది కాత్యాయనికి. "బుద్ధివున్న వాడి వయితే యిలా అడుగుతావా? అమ్మనిచూస్తే జాలివేయటం లేదూ నీకు?"

పౌరుషం దెబ్బతింది. 'పెళ్ళయిన వాడిని, పెద్దవాడిని అనేనా లేక ఎంత మాటంది?' ఎవరేనా విన్నారేమో అని చుట్టూ చూశాడు. అది గమనించి కాస్త తగ్గింది కాత్యాయని. "అదికాదురా! ఎంత నీ యిష్టం వచ్చినట్లు చేసినా, కాస్త అమ్మ, నాన్నల సంగతి పట్టించు కోకపోతే ఎలా? ఇంత నిర్లక్ష్యం నీకెలా ఏర్పడిందసలు?"

"నిర్లక్షమేమిటే? పరిస్థితులలా వచ్చాయ్!"

నవ్వొచ్చింది కాత్యాయనికి. 'పరిస్థితులట పరిస్థితులు! ఎంత మూఢత్వం? ఆ మాత్రం నిగ్రహం, ఆలోచనాలేని జడులు. తన కాళ్ళమీద తను గట్టిగా నిలడలేకపోయినా, జంట కావాలి డ్యూయెట్లు పాడుకోడానికి. ముందు ఆర్థిక స్థితి భూతంలా నోరు తెరచుకు ప్రశ్నిస్తోంటుంది. ఇలాంటి దద్దమ్మలు ప్రేమ డైలాగులు చెబుతుంటారు. పట్టుమని మూడొందలు జీతంలేని ఈ మహానుభావుడు రేపు వరసగా పిల్లల్ని కంటాడు. మళ్ళీ మొదలు మరో కుటుంబం.' నిరసనగా చూస్తూ మౌనంగా కూర్చున్న కాత్యాయనిని చూసి క్షణం సిగ్గు పడ్డాడు. కాని కోపమూ పొంగింది మరుక్షణంలో. 'తనకంటె చిన్నది! ఎందుకిలా అధికారం ప్రదర్శిస్తోంది.' రోషంగా అడిగాడు. "ఏమే, ఇంతోటి ఆఫీసర్‌గారికి పెళ్లామొకటా అని చూస్తున్నావా? ఏం? తక్కువ జీతగాళ్లు పెళ్ళిచేసుకోకూడదని నీ సిద్ధాంతమా?"

"ఎందుకు చేసుకోకూడదూ? నెలకు డెబ్బయ్యే తెచ్చుకునే వాళ్ళు వున్నారు. కుటుంబం అక్కర్లేనివాళ్లు ఎవరూలేరు. కాని కొద్దో గొప్పో మనమున్న స్థితినుంచి ఎదగాలంటున్నాను. మన తర వాత వాళ్ళకి కాస్త చెయ్యేంది స్తేగాని ఎలాగ అని అడుగుతున్నాను. అందుకోసం మన మధ్యతరగతి సంసారాల్లో కొంతమంది త్యాగం చేయకతప్పదు. మన అమ్మ, నాన్నలు చేసిన తప్పుకి వారిని ద్వేషించ లేం! వీలున్నంతవరకూ సర్దుకోవడమే!"

"చాలా సులువుగా చెప్పేస్తున్నావ్ త్యాగం అంటూను. పోనీ

నువ్వు చెయ్యగలవా?" వెటకారం ధ్వనించింది. విస్తుబోయింది కాత్యాయని. "నువ్విలా మాట్లాడగా వినడం ఇదే ప్రథమం. ఉన్న మాటంటున్నానని కోపగించుకోకుగాని ఇది.... మరి వదినగారి ప్రభావ మేమో! సరేలే. ఏదేమైనా నీవ్యక్తిత్వాన్ని మట్టుకి నువ్వు పోగొట్టు కోకు. సరే, ఇంక త్యాగం అంటూ మాటెత్తేవు కనుక చెబుతు న్నాను. నేను ఏం చేయగలనో అంతాచేస్తాను. నా కోరిక నీకు తెలుసుగా. ఎమ్. బి. చదవాలనేది.... అది తీరలేదు. నాకెంతో బాధగా వుంటుంది. అటువంటి బాధ నా తమ్ముడు, చెల్లాయిలు పడ కూడదు. అదే నా ప్రయత్నం. అమ్మ వెర్రిబాగుల్ది. వండి పెట్టడం పిల్లలకోసం తహతహపడ్డం మాత్రం తెలుసు. వీలయినంతవరకూ అమ్మని సంతోషంగా వుంచడమే కావలసింది."

రంగారావు మనసు చివుక్కుమంది. తను చేసినపని తప్పేమో అన్నవూహ ఇంతకుముందు కలిగినా, ఇప్పుడది మరీ బలంగా పని చేస్తోంది. కాని ఏవిటో ఈవేళ కాత్యాయనిని చూసేసరికి మనసులో ముల్లు గుచ్చుకున్నట్టుంది. రంగారావు దూరంగా ఆడుకుంటున్న ఇద్దరి పిల్లలవేపు దృష్టి సారించి ఆలోచిస్తూండిపోయాడు. కాత్యా యనికీ తెలుస్తోనే వుంది అతని మనసులోని సంఘర్షణ. తనూ అటేచూస్తూ నవ్వి అంది. "ఒరే, అన్నయ్యా నువ్వుమాత్రం పది మంది పిల్లల్ని కనకు. ఇద్దరంటే ఇద్దరే. అసలు నన్నడిగితే ఒక్కరే చాలంటాను."

తేలిగ్గా నవ్వుతూ అన్న కాత్యాయని మాటలకి తేరుకున్నాడు రంగారావు. అమ్మ, నాన్నలకంటె ఇదే నయం. ఈ మాత్రం మాటలేనా మాట్లాడగలిగింది. ఎలాగయినా కాత్యా తీరువేరు అను కున్నాడు.

"ఇంతకీ వదినగార్ని చూపిస్తావా నాకు?"

ఆశ్చర్యమూ, ఆనందమూ కూడా కలిగాయి రంగారావుకి. తనింటికి రమ్మని పిలవడానికి మొహమాట పడ్డాడు. సిగ్గుపడ్డాడు.

* * *

అదొక చిన్న తాటాకులతో కట్టిన యిల్లు. ఇంటిముందు

లక్ష్మి ముఖం వికసించింది. రంగారావన్నాడు. "అమ్మా వాళ్ళు...." అని ఆగిపోయాడు.

"అమ్మా వాళ్ళు కులం గురించికంటె కూడా .... నువ్వు చెప్పా పెట్టకుండా చేసుకున్నావనే ఎక్కువ బాధపడ్డారు."

లక్ష్మి ముఖం ముడుచుకుపోయింది. "పోనీ....జరిగిందేదో జరిగిందనుకో. ఇప్పుడు మాత్రమేం నా సహాయం వుండనే వుంటుంది."

లక్ష్మి చురుక్కున చూపింది రంగారావు కేసి. కొద్దిగా జంకాడు. ఉసూరుమనిపించింది కాత్యాయనికి.

* * *

"ఏమే! ఎక్కడికెళ్ళొచ్చావ్!" సందేహంగా చూస్తూ అడిగింది సుభద్రమ్మ. ఆమెకి తెలుసు రంగారావు దగ్గిర కెళ్ళిందని.

"ఇంకెక్కడికి! వదినగారిని చూడ్డానికి" నవ్వుతూ అంది కాత్యాయని, చెప్పులు విడుస్తూ.

"ఊ! మా గొప్ప వదినగారులే! ఎందుకెళ్లావసలు" ముఖం చిట్లించింది సుభద్రమ్మ.

"నువ్వెంత కోపం చూపించినా, అక్కడి సంగతి తెలుసు కోవాలని నీకుమాత్రం లేదేమిటి?"

"ఏముందిలే తెలుసుకునేందుకు? కాస్తంత రెక్కలొచ్చాయి. ఎగిరిపోయాడు. ఓ మాదిరిగానైనా మంచి సంబంధం చూసి చేసు కుంటే....అదో తృప్తిగానైనా వుండేది."

"అలా అనుకోనక్కరలేదమ్మా! గుడిసె అన్నమాటగాని హంగులన్నీ బాగానే వున్నాయి. ఆ అమ్మాయికూడా లక్షణంగా మనింటిపిల్లలాగే వుంది. ఇంట్లో అంతా గచ్చు చేసారు. రెండు గదులు. ముందు వసారా! చుట్టూ కాస్త స్థలముంది. మంచాలు, కంచాలు వగైరా బాగానే వుంది. నన్నడిగితే మన స్థితి యెలావుందో వాళ్ళూ అలాగే వున్నారు."

"అదేకదనే మొత్తుకొనేదీను. ఏదో ఆ టైపిస్ట్ వుద్యోగం వచ్చింది కదా! కాస్త మెరుగైన సంబంధం చూస్తే, ఓ మూడు

వేలైనా కట్నం రాకపోతుందా అని నేననుకుంటే...."

కలకల నవ్వింది కాత్యాయని. "ఆ కట్నం సమస్యే, ఆపిల్ల చేత అంత ధైర్యం చేయించింది. నన్నిడిగితే ఆ పిల్ల మహా తెలివైందంటాను. అన్నయ్య సాయంతో తన తరవాత వాళ్ళకి కాస్త చేయూతనిస్తుంది."

"ఇక్కడ మనం చచ్చినా సరే వాడికి అఖర్లేదన్న మాట" సుభద్రమ్మకి ఉక్రోషం, కన్నీళ్ళు ఒక్కసారే పొంగాయి.

అనునయంగా అంది కాత్యాయని.

"అమ్మా! బాధపడి, ఏడ్చి ప్రయోజనం లేదు. మన లాంటి మరో కుటుంబానికి కాస్త ఆసరా దొరికింది. అంతే! వాడిని కన్నందుకు వాడిమీద నీకెలాగూ ప్రేమ పోదు. ద్వేషంగా మార్చుకోవాలని చూడకు. నువ్వొక సంబంధం చూసి చేసినా, ఆ వచ్చేది మాత్రం ఇలా వుండదని ఏమిటి గ్యారంటీ? నీకెందుకమ్మా, నేనే నీ కొడుకనుకో!"

"కొడుకనుకొంటే ఎలాగమ్మాయ్! మీ అమ్మ రోజుకు వంద సార్లు నీ పెళ్ళి సంబంధం గురించి నన్ను అడుగుతూనే వుంటుంది." నవ్వుతూ, ఈ మాటలంటూ లోపలికొచ్చాడు అవతలింటి చలపతి.

"మీరా మామయ్యా! రండి."

సుభద్రమ్మ కళ్ళు, ముఖం తుడుచుకుని, క్షీణస్వరంతో అంది. "కూర్చోండి అన్నయ్యా! ఆయనలా వెళ్ళారు! ఏమైంది ఆ సూపర్ వైజర్ సంబంధం?"

"అదే చెప్పొస్తున్నానమ్మా! వాళ్ళకి కనీసం అయిదువేలు కట్నం ఇవ్వాలిట. పెళ్ళి ఎలా జరిపినా ఫరవాలేదంటున్నారు."

భుజాలెగరేసింది కాత్యాయని. "ఐదువేల పైసాలా రూపాయలా మామయ్యా?"

"నువ్వూరుకోవే!" అని కసిరింది సుభద్రమ్మ.

"పైసలుచ్చుకునే మహానుభావులేరమ్మా ఈ కాలంలో! నన్నడిగితే కాత్యాయనిలాంటి మెరుపు తీగెకి ఎదురు కట్నం యివ్వాలి."

"అద్గదీ! మామయ్యా! మంచి మాట చెప్పావ్! అలా ఎవ రేనా వుంటే చూడ్దా! చేసుకుంటాను. అంతేకాని మా యింటి కొచ్చావ్ మాకేం తెచ్చావ్! మీ యింటికొచ్చేను నాకేమిస్తావ్ అన్న బాపతు పెళ్ళికొడుకు వొద్దు వస్తా? స్నానంచేసి రావాలి." అంటూ లోపలికి పరుగు తీసింది. చలపతి, సుభద్రమ్మ ముఖాలు చూసుకున్నారు. సుభద్రమ్మ నిట్టూర్చింది. "విన్నారా దాని మాటలు."

"అవును, ఆ సంబంధం గురించి చెప్పావేమిటమ్మా!"

సుభద్రమ్మ ముఖం మ్లానమైంది. "ఇంతవరకూ చెప్పలే దన్నగారూ! ఏదీ వస్తూనే మావాడి భాగోతం సరిపోయింది. వాళ్ళింటి కెళ్ళొచ్చిందట. ఇలా జరిగిందని దీని కసలు వుత్తరం కూడా రాయ లేదు మేము."

"నిజానికా సంబంధం చెప్పడానికి నాకే నోరు రాలేదు. కాని ఏం చేస్తాం. తెలిసిన వార్త చెపితే మంచిదని చెప్పేనంతే. ఈ సంబంధం చూస్తే యిలా కట్నం...."

ఇంతలోనే వెంకట్రావు వచ్చాడు. కాసేపు అవీ యివీ మాట్లాడుకొన్నాక వెంకట్రావు అన్నాడు నెమ్మదిగా! "ఎలాగోలా పి. ఎఫ్ అదీ తీసి దీని పెళ్ళి కానిచ్చేస్తాను. ఆ సూపర్వైజర్ సంబంధం చూద్దాం." అని.

కాత్యాయనిదగ్గర ఆ మాట కదిపేసరికి ఖస్సున లేచింది.

కాత్యాయనికంటే ఓ యేడాది మాత్రమే పెద్దయిన రామం కల్పించుకున్నాడు. "అప నే! అన్నిటికీ నీ యిష్టమేననుకోకు. ఇదిగో నా చదువైపోనీ...."

అతని మాటని మధ్యలోనే ఖండించింది కాత్యాయని. "పెద్దన్నయ్యలా నువ్వు ఓ పిల్లని చూసి పెళ్ళాడెయ్యి."

కోపం వచ్చేసింది రామానికి, "అందరూ అలా బుద్ధితక్కువ వాళ్ళే ననుకోకు. మా ఫ్రెండు వాళ్ళ నాన్నగారు కొత్తగా ఓ కంపెనీ పెడుతున్నారు. అందులో అకౌంట్స్ డిపార్టుమెంట్లో నన్ను తీసుకొంటానని మాటిచ్చారు. ఈ బి. కాం. అయిపోతే"

"నిజమేన్రా?" వెంకట్రావు, సుభద్రమ్మ ఒక్కసారే

అడిగారు ఆశగా.

"అవునమ్మా! ఇన్నాళ్ళూ మీకు చెప్పలేదు. ఎందుకు వూరికి ముందే డబ్బా కొట్టడం అని. ఇదిగో యెల్లుండినించి పరీక్షలా! రిజల్ట్సు రాగానే.... ఆ జాబ్ దొరుకుతుంది. వాళ్లు యించుమించు అన్ని ఏర్పాట్లూ పూర్తి చేసుకొన్నారు."

"ఎవర్రా ఆ ఫ్రెండూ?"

"శంకర్ నాన్నా! నీకూ తెలుసుగా! వాళ్లు ఫార్మస్యూటికల్ కంపెనీ ఒకటి పెడుతున్నారని."

"ఆ! ఆ! విన్నాను. అయితే నిజంగానే ఆ సహాయం చేస్తారుట్రా!" వెంకట్రావు ముఖం విప్పారింది.

* * *

రాత్రి అందరూ పడుకొన్నాకా మళ్ళీ కదిపింది సుభద్రమ్మ. "కాత్యా! నా మాట వినవే! చలపతి మామయ్య మరో మాటకూడా చెప్పాడు. ఆ పెద్దమనిషికి నలుగురు పిల్లలుట. కావలసినంత ఆస్థి వుందట. నలభై అయిదేళ్ళు పైబడ్డాయట. హైదరాబాద్‌లో వుంటున్నాడట. కాస్త బీదింటిపిల్లని చేసుకోవాలని. అలా చేసుకుంటే వాళ్ళ కుటుంబానికికూడా సహాయపడతాడట." నిర్వికారంగా తల్లి చెప్పుకుపోతుంటే కళ్లు పెద్దవి చేసుకొని వింది కాత్యాయని. గుండెలలో శూలంపెట్టి పొడిచినట్లయింది.

"పెళ్ళిమాట ఎత్తకమ్మా, నా కసహ్యం!" అంది యెలాగో గొంతు పెగల్చుకొని.

"అలా నర్సమ్మలాగే వుండిపోతావేమిటే లేకపోతేనూ...." అదేమిటో ఏనాడూ ఉద్రేకపడని సుభద్రమ్మ గొంతు చించుకొని అరిచింది.

విస్తుబోయింది కాత్యాయని, "ఎందుకమ్మా! అంత కోపం?"

తగ్గకుండా అంది సుభద్రమ్మ. "కాకపోతే ఏమిటే, ఆ పల్లెటూళ్ళో పాడు నర్సుపని చేసుకుంటూ కలకాలం అలాగే వుండిపోతావా? ఎవడో ఒకడ్ని కట్టుకుని మా కళ్ళమంటలు చల్లార్చండే,

"అద్గదీ! మామయ్యా! మంచి మాట చెప్పావ్! అలా ఎవ రేనా వుంటే చూద్దూ! చేసుకుంటాను. అంతేకాని మా యింటి కొచ్చావ్ మాకేం తెచ్చావ్! మీ యింటికొచ్చేను నాకేమిస్తావ్ అన్న బాపతు పెళ్ళికొడుకు వొద్దు వస్తా? స్నానంచేసి రావాలి." అంటూ లోపలికి పరుగు తీసింది. చలపతి, సుభద్రమ్మ ముఖాలు చూసుకున్నారు. సుభద్రమ్మ నిట్టూర్చింది. "విన్నారా దాని మాటలు."

"అవును, ఆ సంబంధం గురించి చెప్పావేమిటమ్మా!"

సుభద్రమ్మ ముఖం ప్లానమైంది. "ఇంతవరకూ చెప్పలే దన్నగారూ! ఏదీ వస్తూనే మావాడి భాగోతం సరిపోయింది. వాళ్ళింటి కెళ్ళొచ్చిందట. ఇలా జరిగిందని దీని కసలు వుత్తరం కూడా రాయ లేదు మేము."

"నిజానికా సంబంధం చెప్పడానికి నాకే నోరు రాలేదు. కాని ఏం చేస్తాం. తెలిసిన వార్త చెపితే మంచిదని చెప్పేనంతే. ఈ సంబంధం చూస్తే యిలా కట్నం...."

ఇంతలోనే వెంకట్రావు వచ్చాడు. కాసేపు అవీ యివీ మాట్లాడుకొన్నాక వెంకట్రావు అన్నాడు నెమ్మదిగా! "ఎలాగోలా పి. ఎఫ్ అదీ తీసి దీని పెళ్ళి కానిచ్చేస్తాను. ఆ సూపర్వైజర్ సంబంధం చూద్దాం." అని.

కాత్యాయనిదగ్గర ఆ మాట కదిపేసరికి ఖస్సున లేచింది.

కాత్యాయనికంటే ఓ యేడాది మాత్రమే పెద్దయిన రామం కల్పించుకున్నాడు. "అఫ్ నే! అన్నిటికీ నీ యిష్టమేననుకోకు. ఇదిగో నా చదువైపోసీ...."

అతని మాటని మధ్యలోనే ఖండించింది కాత్యాయని. "పెద్దన్నయ్యలా నువ్వు ఓ పిల్లని చూసి పెళ్ళాడెయ్యి."

కోపం వచ్చేసింది రామానికి. "అందరూ అలా బుద్ధితక్కువ వాళ్ళే ననుకోకు. మా ఫ్రెండు వాళ్ళ నాన్నగారు కొత్తగా ఓ కంపెనీ పెడుతున్నారు. అందులో అకౌంట్స్ డిపార్టుమెంట్లో నన్ను తీసుకొంటానని మాటిచ్చారు. ఈ బి. కాం. అయిపోతే"

"నిజమేనట్రా?" వెంకట్రావు, సుభద్రమ్మ ఒక్కసారే

అడిగారు ఆశగా.

"అవునమ్మా! ఇన్నాళ్ళూ మీకు చెప్పలేదు. ఎందుకు వూరికి ముందే డబ్బా కొట్టడం అని. ఇదిగో యెల్లుండినించి పరీక్షలా! రిజల్ట్సు రాగానే....ఆ జాబ్ దొరుకుతుంది. వాళ్లు యించుమించు అన్ని ఏర్పాట్లూ పూర్తి చేసుకొన్నారు."

"ఎవర్రా ఆ ఫ్రెండూ?"

"శంకర్ నాన్నా! నీకూ తెలుసుగా! వాళ్ల ఫార్మస్యూటికల్ కంపెనీ ఒకటి పెడుతున్నారని."

"ఆ! ఆ! విన్నాను. అయితే నిజంగానే ఆ సహాయం చేస్తారుట్రా!" వెంకట్రావు ముఖం విప్పారింది.

*　*　*

రాత్రి అందరూ పడుకొన్నాక మళ్ళీ కదిపింది సుభద్రమ్మ. "కాత్యా! నా మాట వినవే! చలపతి మామయ్య మరో మాటకూడా చెప్పాడు. ఆ పెద్దమనిషికి నలుగురు పిల్లలుట. కావలసినంత ఆస్థి వుందట. నలభై అయిదేళ్ళు పైబడ్డాయట. హైదరాబాద్‌లో వుంటున్నాడట. కాస్త బీదింటిపిల్లని చేసుకోవాలని. అలా చేసుకుంటే వాళ్ళ కుటుంబానికికూడా సహాయపడతాడట." నిర్వికారంగా తల్లి చెప్పుకుపోతుంటే కళ్లు పెద్దవి చేసుకొని వింది కాత్యాయని. గుండెలలో శూలంపెట్టి పొడిచినట్లయింది.

"పెళ్ళిమాట ఎత్తకమ్మా, నా కసహ్యం!" అంది యెలాగో గొంతు పెగల్చుకొని.

"అలా నర్సమ్మలాగే వుండిపోతావేమిటే లేకపోతేనూ...." అదేమిటో ఏనాడూ ఉద్రేకపడని సుభద్రమ్మ గొంతు చించుకొని అరిచింది.

విస్తుబోయింది కాత్యాయని, "ఎందుకమ్మా! అంత కోపం?"

తగ్గకుండా అంది సుభద్రమ్మ. "కాకపోతే ఏమిటే, ఆ పల్లెటూళ్ళో పాడు నర్సుపని చేసుకుంటూ కలకాలం అలాగే వుండిపోతావా? ఎవడో ఒకడ్ని కట్టుకుని మా కళ్ళమంటలు చల్లార్చండే,

తల్లీ! బంగారు తల్లిలా సరస్వతి మా మాటవింది. ఓ కుంపటి తొలిగింది. నువ్వే కొరకరాని కొయ్యవి."

"ఏమిటమ్మా నీ కోపం! ఎందుకిలా మండిపోతావు. ఇలా ఎప్పుడూ ఎగిరిపడలేదు నువ్వు. ఏం జరిగిందో చెప్పు!"

"ఏం జరిగిందా?" క్షణం ఆగి కాత్యాయని ముఖంలోకి చూస్తూ వుండిపోయింది సుభద్రమ్మ.

"మంగమ్మ అక్కడ వంటలకొస్తోందా?" సూటిగా చూస్తూ ప్రశ్నించింది.

"ఔను!" ఆమె అడగబోయేదేమిటో అర్థంకాలేదు కాత్యాయనికి.

"ఆవిడగారి పిన్నమ్మకూతురుట మన వెనక వీధిలోవున్న మంగతాయారు."

"ఓ! అలాగా, అయితే ఏమిట్ట? ఈ జోడు మంగమ్మల గొడవెందు కొచ్చింది నీకు?"

"నాకు కాదే వస్తే. నా ఖర్మ" అని తల బాదుకుంది.

"ఏమిటమ్మా సంగతి?"

"ఆవిడ మొన్న వచ్చినప్పుడు నీ గురించి ఏదో వాగిందట" ఆపైన సుభద్రమ్మకి నోరురాలేదు. అర్థమైంది కాత్యాయనికి. నివ్వెరబోయింది. ఈ క్షణంలోవెళ్ళి మంగమ్మని నరికి పారేస్తే....అనిపించింది. "అమ్మా! నువ్వు....నన్ను...."

"ఊరుకోవే తల్లీ! మరేం మాట్లాడకు. నా కర్మకాలి కన్న కూతురిమీద యిలాంటి మాటలు వినవలసి వచ్చింది. ఏ ముఖం పెట్టుకుని నిన్నడగ గలనే! అడగకుండా ఎలా వూరుకోగలనే!"

కాత్యాయనికి మొదటిసారిగా తనున్నస్థితికి బాధ కలిగింది. తల్లి పడేవేదన చూసేసరికి మనసు ద్రవించి పోయింది.

"ఏమిటమ్మా యిది? వాళ్ళేదో వెధవ వాగుడు వాగేరని...."

"సరే పోనీ, అదలా వుంచు. నువ్వు మాత్రం ఆ నర్సు వుద్యోగంచేస్తూ, పెళ్ళి పెటాకులులేకుండా వుండిపోతానంటే నేను వూరుకోను. పోనీ ఏ డాక్టరో, ప్రొఫెసరో కాదు. ముష్టి నర్సు

వుద్యోగం. చాల్చాలు."

"ఏ డాక్టరో, ప్రొఫెసరో అయితే పెళ్ళిలేకపోయినా ఫరవా లేదామ్మా!"

"నువ్వేమైనా అను. ఆ వుద్యోగాలంటే గౌరవం వుంటుంది. ఆ హోదామాటున మిగిలిన విషయాలాట్టే పట్టవు. ఈ వుద్యోగం మాత్రం నువ్వు వదిలేయ వలసిందే!

"ఏమిటాలోచన. ఇన్నాళ్ళూ మరీ కష్టంగా వుండికదా! రంగా గాడికి సరయిన వుద్యోగంలేదని వూరుకొన్నాను. ఇకమీదట రామా నికి వుద్యోగమైనా కాకపోయినా సరే, నీ పెళ్ళిమాత్రం జరిగి తీరా ల్సిందే. తల్లి మరో నాలుగురోజులు బ్రతకాలంటే నే చెప్పినట్లు వినాల్సిందే!" కరుగ్గా, ఖచ్చితంగా చెప్పింది సుభద్రమ్మ.

"అమ్మా!" విలవిల లాడింది కాత్యాయని. చాలా అరుదుగా వచ్చే కన్నీళ్లు ఆమె నీవాళ నిలువునా ముంచెత్తాయి.

"ఛీ!" వికలమైన మనసుతో అనుకొంది. "ఏం మనుషులు? ఏం పరిస్థితులు?"

"ప్రియమైన సుశీల రాజారావుగార్లకి,

నాలుగు రోజులలో వస్తానన్నది ఇంతవరకూ జాడలేదే అను కుంటున్నారా? డాక్టరుగారూ, ముందు మీరు నన్ను క్షమించండి. ఒక్కరూ ఎంత యిబ్బంది పడుతున్నారో. నేను వచ్చేవారం బయలు దేరి వస్తాను. ఇక ఇక్కడ విశేషాలు. మా రంగా పెద్ద హీరో అయ్యాడు. ప్రేమించి కులాంతర వివాహం చేసుకున్నాడు. నిజానికి వీడు చేసుకున్నాడు అనేకన్నా ఆ అమ్మాయి (పేరు-లక్ష్మి) వీడిని చేసుకొంది అనాలి. అయితే అయిందిగాని వున్నమాట చెప్పాలంటే కాస్తోకూస్తో ఆర్థికంగా వాడి అండపోయింది. అదీ ఇక్కడ విచా రించాల్సిన విషయం. అమ్మ, నాన్నలకి కూడా. ఇక మా చిన్నన్న రామం బి. కాం. పూర్తిచేస్తాడు త్వరలో. వాడికీ భవిష్యత్తుమీద ఆశ మినుకు మినుకు మంటోంది. తద్వారా మా వాళ్ళకీను. అక్క సంగతి మీకు తెలుసుగా. జీవితంలో చాలా గొప్పగా రాజీపడి పోయింది. మిగిలింది నేను, మా చెల్లి, తమ్ముడూను. వాళ్ళిద్దరూ

ఇంకా చిన్నవాళ్ళు. పైకి తీసుకురావాలి వాళ్ళని. ప్రస్తుతం మా అమ్మకి నేను గుండెలమీద కుంపటిని. మా నాన్నకు నెత్తిమీద టన్ను బరువును. మా చిన్నన్న రామానికి అరటన్ను బరువుని. అందరూ కలిసి పెళ్ళాడతావా లేదా అని కూర్చున్నారు.

సుశీ, రాజా, మీ రిద్దరూకూడా నాకు ఎంతో ఆప్తులు. అసలు ఆప్తులు అంటే మీరిద్దరే. ప్రకాశం మామయ్యకూడాను. కానీ ఆయనతో యింత మనసువిప్పి చెప్పలేనుకదా. పెళ్ళిమాటెత్తితే నాకేమిటో పులకరింతలు, తియ్యని వూహలు రావటంలేదు సరికదా రవంత వెగటుగాకూడా వుంది. కారణం మీకు తెలుసు. ఆ వచ్చిన వాడు కేవలం స్నేహితుడిగా వుండిపోతే ఎంత బాగుండును. కాని అది అసంభవం అని తెలుసు. అమ్మ గొడవ ఎక్కువగావుంది. మానసికంగా చాలా కృంగిపోయింది. ఈ నర్సు వుద్యోగం తక్షణం వదలాలిట. మీ మంగమ్మగారు కొంత పుణ్యం కట్టుకుందిలే.

సుశీలా, ఆవిడ వదిలేది విషపుగాలి. పీల్చేది అనుమానప్ర గాలి. 'వీళ్ళనేమిటి కేర్ చేసేది?' అనుకుంటాం. కాని వీళ్లు వైరస్ లాంటివాళ్లు. ఇటువంటివారు సమాజానికి యెంత చేటుచేస్తారో వూహించేలేము. సరేపోనీ, ఆవిడని అక్కణ్నించి తొందరగా తర మండి. డాక్టర్, నేనయితే ఓ శుభవేళ ఆవిడకి ఓ ఇంజెక్షన్‌తో మోక్షం కలిగించేద్దును. ఆ....ఆ....భయపడకండి. అమ్మ ఆవేశ పడిన బాధచూస్తే నాకంత చేయాలనే ద్వేషం పుట్టుకొచ్చింది. దేవు డావిడని అకస్మాత్తుగా మూగదాన్నిచేసినా బాగుండును.

ఏమిటో! తిక్కతిక్కగా రాస్తున్నాను కదూ! ఇంతకీ సంగ తేమిటంటే, ఓ నవయువకుడు, సూపర్‌వైజర్, అయిదువేల కట్నం యిస్తే, నన్ను పెళ్లాడడానికి సిద్ధంగా వున్నాడు. కిందా మీదాపడి అది ఇవ్వడానికి సిద్ధంగానే వున్నారు నాన్న. ఇక ఓ వయసు మళ్ళి పోతున్న వ్యాపారస్థుడు, నలుగురు పిల్లలు గలవాడు, మా కుటుం బాన్ని ఉద్ధరిస్తాననే హామీతో రెడీ. నేను వూ అనాలంతే. ఈ ఇద్ద రిలో యెవరి నెన్నుకోవాలా అనేది సమస్య. పెళ్ళయిందా అనడిగి లేదంటే పిల్లలెంతమందని నెక్స్ట్‌కొశ్చెన్ అలావుంది నాపని. పెళ్ళే

వద్దంటే, ఎవరినో ఒకర్ని యెన్నుకోవడమనే పని తగిలింది.

సుశీ యెంతో ప్రయత్నించాను. అమ్మ ఒప్పుకోటం లేదు. నాన్న సరేసరి. ఆ కట్నం ధారపోద్దామనే వూహలో వున్నారు. ఆ డబ్బుంటే రేపు తమ్ముడి చదువుకు ఉపయోగపడదూ! రామం జాబ్ సంపాదించినా ధరలు విపరీతంగా పెరిగిన ఈ రోజుల్లో సంసారం నడపడం అంతంత మాత్రంగానే వుంటుంది. దేనికీ లొంగననుకున్న నేను అమ్మకి లొంగిపోవలసి వస్తోంది. దీని కుభయతారక మంత్రం యేమిటా అని ఆలోచిస్తున్నాను .... చించేను కూడా. అదేమిటని అడుగుతారా! అబ్బ! అది చెప్పను. డాక్టరుగారూ, మరో నర్సును వెతుక్కోండిప్పట్నుంచే. నా మూటా ముల్లె సర్దుకుపోవడానికి వస్తాను. నా నిర్ణయం మీ కర్థమయే వుంటుంది. మిగతా విషయాలు సమక్షంలో.

మీ,

కాత్యా.

వుత్తరం చదువుకొని నిట్టూర్చారు సుశీల, రాజారావులు.

"ఏమిటండీ ఇది? మనమేం చేయలేమా దానికి?"

"ఏం చేస్తాం చెప్పు! కట్నం కావాలంటే యిస్తాం. ఆ సహాయం ఆమె అంగీకరిస్తుందా?"

"ఎంతమాత్రం అంగీకరించదు."

"మరి! కథల్లో తప్ప, అభ్యుదయభావాలు, ఆచరణలో పెట్టగల ధీరులు అయిన యువకులు ఎంతమంది వున్నారు? ఎక్కడున్నారు?"

"ఏమిటోనండి! ఇదే ఏ నవలలో అయితే ఓ గొప్పవాడు, అందగాడు వచ్చి, ప్రేమకి గొప్ప, బీద తారతమ్యం లేదంటూ గ్రాండ్‌గా పెళ్ళి చేసుకొనేవాడు.

"తెగ చదువుతావుగా తెలుగు నవలలు, నీకే తెలియాలి." అని నవ్వాడు రాజారావు. అతని మనసులో ఆనాటి కాత్యాయని మెరిసింది. పార్కులో తనని తిరస్కరించిన రూపు.

"ఏమిటాలోచిస్తున్నారు?"

"ఊ! చెప్పనా! సుశీలా! ఒకటి చెప్తాను. సరిగ్గా అర్థంచేసుకో

గలవా అని చూస్తోన్నాను."

"ఏవిటి చెప్పండి."

ఆనాటి సంఘటన చెప్పాడు రాజారావు. "ఎందుకో నాకీవాళ సీతో చెప్పేయాలనిపించింది. నువ్వెలా తీసుకొంటావో తెలియదు" ఆమె చేతిని నిమురుతూ అన్నాడు.

"కొంతవరకు వూహించగలిగాను. కాత్యాయని విషయం తెలుసుగా నాకు. మిమ్మల్నిప్పుడేం తప్పుగా అర్థం చేసుకోనులెండి. భయపడకండి" అని నవ్వేసింది సుశీల. "అమ్మయ్య" తెలికపడ్డాడు రాజారావు.

* * *

"ఓ! కాత్యా! రా, రా!" ఆదరంగా రెండు చేతులూ పట్టుకుంది సుశీల.

"ఎలా వున్నావే! బాబేమంటున్నాడు బొజ్జలో. అబ్బ! ఎన్ని రోజులో అయినట్లుంది నిన్నుచూసి" సుశీలకి ఆనుకుని కూర్చుంటూ అంది కాత్యాయని.

"అబ్బో! ఇప్పుడిలా అంటావు, రేపో సూనర్‌వైజర్‌గారితో వెళ్ళిపోతే మేం యింక గుర్తుకూడా వుండము."

సుశీల హాస్యంగా అందామని ప్రయత్నించింది.

కాత్యాయని పకపక నవ్వింది. "అవునూ. ఆ సూపర్‌వైజర్‌ని పెళ్ళాడతానని నేను చెప్పానా నీకు?"

"మరి?" కళ్ళు పెద్దవి చేసింది సుశీల.

రాజారావూ వచ్చాడు అప్పుడే. అతన్ని గమనించలేదు కాత్యాయని. కాళ్ళు వూపుతూ జోరుగా చెప్పేసింది. "శ్రీ, శ్రీ. శ్రీ రామనాథంగారు, అంటే అదే హైదరాబాద్‌లో వ్యాపారి మహాశయులు. వారిని పెళ్లాడబోతున్నాను. నా ఛాయిస్ ఎలా వుంది?"

"కాత్యా!!" సుశీల, రాజారావు ఒకేసారి అరచినంత పని చేశారు.

"ఎందుకంత ఆశ్చర్యం! ఆయనగారివల్లనైతే మా కుటుంబానికి కాస్త సహాయం దొరుకుతుంది!"

"అందుకని....ఆ ముసలాడిని కట్టుకుంటావా?"

"అక్క కట్టుకోలేదూ?"

"అయితే....అయితే....మాత్రం?"

"అదంతే సుశీ, రాజారావుగారూ, అలా నిలబడిపోయారేంటీ, రండిలా కూర్చోండి. మీ యింట్లో మీకే నేను మర్యాద చేయవలసి వస్తోందే! ఎందుకలా బాధగా పెట్టారు మొహాలు? చదువు, తెలివి, కాస్తోకూస్తో అందచందాలువున్న కాత్యాకీ గతి ఏమిటనా? ఇదింతే. మేం మధ్య తరగతి ఆడపిల్లలం ఫ్రెండ్స్! మీకు తెలియదూ మాకు తెలివితేటలుంటేనేం, అప్సరసల్లాంటి అందచందాలుంటేనేం, వయసుంటేనేం, వలపుంటేనేం....అన్నీకూడా ఉప్పులేని కూరలాంటివే. దేశంలో ఇన్ని కాలేజీలు, ఇంతమంది ఉడుకు రక్తం పొంగుతున్న యువకులూ వున్నారు. బోలెడన్ని స్టేజీలు, వీరంతా ఉపన్యాసాలు దంచడానికి మైకులు, వరకట్న పిశాచి అంటూ గుద్ది చెప్పడానికి బల్లలూ అన్నీ కోకొల్లలు, కాని అక్కని మోసంచేసిన కేశవరావులే అందులో ఎక్కువ, లేకుంటే మా రంగాలాంటి పిరికిగొడ్లూ, వ్యక్తిత్వం లేనివాళ్ళూను. దేశంలో ఇలాంటి జనాభానే ఎక్కువ. డబ్బు అనేది నిప్పులాంటిది. తగినట్టుగా వాడుకుని తగినంత దూరంలో వుంచిన్నాడే దాని ఉపయోగం. అదే సర్వస్వం అనుకుంటున్నారు. వారిలోని యుక్తాయుక్త విచక్షణా జ్ఞానాన్ని, మానవత్వాన్ని, వ్యక్తిత్వాలని కూడా మంటలు గలుపుతోంది. సరే, పోనీండి. ఈ వ్యవస్థ మారేది ఎన్నటికో? మారిన మనుషులు నవలల్లోనూ, సినిమాల్లోనూ కనిపిస్తున్నారు. వారికి నా జోహార్లు."

సుశీల, రాజారావు స్తబ్దుగా చూస్తున్నారు.

మళ్ళీ కాత్యాయనే అంది ఆవేశాన్నణచుకుంటూ, "ఒక రహస్యం చెప్తాను. మీకు గనక, మీరు నా గురించి చెడ్డగా అనుకున్నా సరే!"

కుతూహలంగా చూశారిద్దరూను.

"నేనీ పెళ్ళి స్వార్థంతోనే చేసుకుంటున్నాను."

"మీ వాళ్ళకోసం నీ త్యాగం...."

"ఆ మాట ఇప్పుడు అంతగా వాడక్కరలేదు. నేను ఎలాంటి
యినా చేద్దామనే అనుకున్నాను, ఆ అవసరం లేకుండా నా
రే సమయం వచ్చింది."

"ఏమిటో చెప్తావు, నీ మాటలు....నువ్వూనూ...."

"వేళాకోళం కాదే! నిజంగానే! దశరథుడికి మూడో భార్య

"అయితే...."

"అయితే ఏవుంది. కొన్ని షరతులు ముందే పెడతా. మా
దువులకి ఆయనగారే తోడ్పడతానన్నాడు. ఇక ముద్దులపడుచు
చదువుకి అభ్యంతర పెడతాడనుకోను."

"అంటే...."

"ఊ! కాత్యాయని జీవితాశయం నెరవేర్చుకోడానికి ప్లాను
ఆ వివాహవేదిక నా ఆశయసిద్ధికి మొదటి మెట్టు."

"కాత్యాయనీ...." ఏమనాలో తెలియలేదు ఇద్దరికీ.

"ఎంత స్వార్థచింతన అనుకుంటున్నారా? అనుకోండి, అవ
ని ఈ విధంగా ఉపయోగించదల్చుకొన్నాను. ఆయనగారికిందులో
అన్యాయమేమీ లేదు. ఒకవేళ అన్యాయమనుకొంటే, నలుగురు
తండ్రి పాతికేళ్ళ చిన్నదైన కన్యామణిని చేపట్టాలనుకోవడం
అన్యాయంకాదు. డబ్బూ మూలుగుతోంది. ఒక లేడీ డాక్టర్ని
ల్లె ప్రజలకి అందించగలిగితే దానికీ సార్థకతే."

"కాని నువ్వనుకొన్నట్టు జరగాలిగా .... ఆయన ఒప్పుకొంం
....లేదో...."

"ఒప్పించడానికి ఏ మందైనా సరే వాడతాను."

"కాత్యా!!"

"అదే మరి! ఉన్న మాటంటే భరించలేరు, నవలల్లో
కలా ఒదిగి, అణగి, మణిగి, మీరే నా దైవం అంటూ ముసలి
డిని ప్రేమించేయగలిగితే సానుభూతి లభిస్తుంది. కాని....
...."

"అబ్బే! అదికాదు కాత్యా! అయినా నువ్వు చెయ్యబోయేదేం

తప్పుపని కాదుగా! నీ సంకల్పం నెరవేరాలని నేను ఆ
వేడుకొంటాను."

"తప్పకుండాను, డాక్టరుగారూ .... ఏడెనిమిదేళ్ళ
మీకు పోటీకొస్తానందోయ్ ఈ వూళ్ళో!"

* * *

"కాత్యా!" పెళ్ళిబట్టలు మార్చి, పట్టుచీరతో కార్లో
పెడుతున్న కాత్యాయనిని గద్గద కంఠంలో పిల్చింది సుశీల.
రాత్రి హైదరాబాద్‌లో జరుపుకుంటామని చెప్పి, ఆమెను పె
రోజునే తీసుకువెళ్తున్నాడు రామనాధం. సుశీల భుజంచుట్టూ చే
వేసి చెవిలో గుసగుసగా అంది కాత్యాయని, "ఈ రాత్రిని ఎదుర్
డానికి అవసరమైన స్థైర్యాన్ని సంపాదించుకొన్నాననుక
న్నాను. ఈ మధ్య రెండు నెలలుగా చేసిన పని అదే."

కారు ముందుకు దూసుకుపోయింది. 'కాత్యాయనీ' అను
గుండె బరువుతో, చెమ్మగిల్లిన కళ్ళతో నిల్చున్నారు అంతా. అ
ఆమె కొత్త పెళ్ళికూతురిలా కనిపించలేదు. నడుం బిగించి,
డాలూ ధరించి జీవనయుద్ధరంగంలో పోరాడుతున్న వీరవనితలా
"ఆమెకు జయం కలిగించు ప్రభూ" అని వేడుకున్నారందరూ

* * *

ఎనిమిదేళ్ళు గిర్రున తిరిగాయి. ఓనాటి ప్రభాత సమ
చెప్పా, పెట్టకుండా హఠాత్తుగా దిగింది కాత్యాయని, "సుశీ,
రావుగారూ.... లేవండి. ఇంకా నిద్రేనా! వూరికో కొత్త లేడీ
రొచ్చిందని.... ఆహ్వానాలు, సన్మానాలు ఏవీ లేవా ఏవి
అంటూను.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M111 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 105 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Sk. Ramya |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |